## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010006832

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పూర్ణాహుతి

## [శ్రీ పొట్టి శ్రీరాములు జీవితచరిత్ర]

(ఉపవాచకము)

రచన

కె. సభా

సబ్ ఎడిటర్, ఆంధ్రప్రభ వారపత్రిక

ప్రధానకార్యదర్శి, చిత్తూరుజిల్లా కళాపరిషత్

పబ్లిషర్సు :

ఆత్మారాం అండు కో., అనంతపురము.

ప్రతులకు :— [redacted]

భగవాన్ అండు కో.,

చిత్తూరు.

(ఆంధ్ర)

# తొలిపలుకు.



విద్వాన్, సాహిత్య విశారద

జీరెడ్డి చెన్నారెడ్డి, ఎమ్.ఏ., బి.ఓ.ఎల్., బి.ఇ.డి., గారు

ప్రధానాంధ్రోపన్యాసకులు,

శ్రీవేంకటేశ్వర కళాశాల, తిరుపతి.

మిత్రుఁడు కె. సభా రచించిన "పూర్ణాహుతి" యను చిన్నిపొత్తమును వ్రాత ప్రతిగానున్నప్పుడే నేను చదివితిని. విషయ మద్వితీయమైనది. తోడిసోదరుల సౌభాగ్యాభివృద్ధికి తన ప్రాణములనే యాహుతిగా నొసరించిన మహా తపస్వి శ్రీ పొట్టి శ్రీరాములు జీవితగాథ. ఆహా! యెంత త్యాగ శీలత! శ్రీరాములవంటి మహానుభావులు ప్రపంచమంతట వెదకినను వందయేళ్ళ కొక్కరుగాని లభింపరు. అట్టివారి నామము ప్రాతఃస్మరణీయము. ఇక నిట్టి పుస్తకమును బాఠ్య ముగాఁ బాఠశాలలయందలి పిల్లలచేఁ జదివించుటెంతయు నావశ్యకము. త్యాగశీలత, పరార్థ జీవనము మన పిల్లలు చిన్ననాటినుండి యలవఱచుకొనఁదగిన గుణములు. గ్రంథమున నితరాంధ్రనాయకుల జీవిత విశేషములును గలవు.

శైలి మిక్కిలి రమణీయమై యనుప్రాసాది శబ్దాలంకార శోభితమై సెలయేటి ప్రవాహామువలె వేగవంతమై యెంతయు నొప్పియున్నది. విద్యాభిమానులందఱు నీ గ్రంథ ప్రచార మును ప్రోత్సహింతురని యాశించుచున్నాను.

ఇట్లు
సుధీవిధేయ

జీ రెడ్డి చెన్నా రెడ్డి



# సూచిక



# ప్రాభవము.



శ్రీలుపొంగు భారతదేశములో సిరులు దొరలుపంట భూమి తెలుగుమాగాణము. పండు ముత్తైదువ నిండుజ్యోత్స్న గౌతమి కెరటముల నృత్య గరిమల యింపు సొంపులతో, కృష్ణవేణి ప్రవాహ గమనముల సొంపు వంపులతో పెన్న కన్నియ ప్రేమగానముల వలపు మెలికల యొయ్యారములతో, నిత్య కల్యాణము పచ్చతోరణమై కలకలలాడుచున్నది ఆంధ్రదేశము.

అలనాటి పలనాటి బాలచంద్రుని తెలుగు కత్తుల తళ తళలు, ప్రతిఫలించెడు పరుసములతో ప్రస్ఫుటించెడు రోస ములతో, ప్రజ్వలించెడు పరాక్రమములతో ప్రతిపక్ష సేనా వాహినుల పాలిటి భయంకర మృత్యుదేవతయై కదన భూమి లో స్వైర విహారము సల్పిన యోధాంగన మగువ రుద్రమాంబ మనయింటి యాడుపడుచు.

దేశ సేవా దురంధరత్వము, దీన జన పరాయణత్వము నిత్యానుష్ఠానమై అనుదినాన్నదానములతో పేదలను సంతృప్తి పఱచిన డొక్కా సీతమ్మ మన తెలుగు జ్యోతి పంటలక్ష్మి. ఆ యెముకలేని చేతినుండి యెన్ని దానము లీయబడినవోగదా!

ఆ మహాసాధ్వి హృదయకమల మెంత సున్నితమైనదో గదా! మఱియెంతటి చల్లనిదైనదో గదా!

అటవీ సత్యాగ్రహపు పోరాటములందు నిటలాక్షు డెదురొడ్డి నిలిచినను పట్టిన పట్టును విడువక, కట్టిన కంకణమును విసర్జించక స్వాతంత్ర్య మహా సమరములో వీరస్వర్గ మలంకరించిన వీర నారీలలామ సాసుమాను వీర గున్నమ్మ మన రైతు పణతి. ఆ వీరపత్ని సాహసము నేమనవచ్చును! ఆ శౌర్యలక్ష్మి మగటిమకు సాటిరాగల యుపమాన మేమున్నది? ఎక్కడున్నది?

ఆ యుగంధరుని ప్రజ్ఞ, ఆనాటి తిమ్మరుసు ఉపజ్ఞ ఆంధ్ర శ్రీ విజయసాధనములకు పాశుపతాస్త్రములు! ఆ మహా మంత్రుల రాచకీయంపు టెత్తులు, అజేయములు. కదనక్రీడల యుక్తు లమోఘములు. పరిపాలనలోని శక్తులప్రతిమానములు.. మహామంత్రి తిమ్మరుసు, మహామేధావి యుగంధరుడు ఆంధ్ర చరిత్రలో సూర్యచంద్రులుగదా!

విశ్వ కళారంగములో విజయనగర సామ్రాజ్య మొక వినూత్న విప్లవమును దెచ్చినది. శిలలు చైతన్య విలసితములై సౌందర్య ప్రపూరితములై, సౌజన్య భావనా గర్భితములై, సౌశీల్యగుణాన్వితములై, సౌభాగ్య శోభితములై నేత్రానంద

ములై నృత్యములు చేసినవిగదా! ప్రకృతి పులకరించగా, ప్రేమలు తొలకరించగా, హృదయములు పలుకరించగా, సప్త స్వరముల సరిగమ పదనిసలు గానముచేసి సౌభ్రాత్రముల జాటినవి గదా!

శిలలకే యింతటి శైలి యలవడినపుడిక కవీశ్వరుల కవన శక్తుల భావనా పటిమల పద లాలిత్యముల, మృదు మధుర మంజుల మనోహర కావ్యరీతుల గుఱించి చెప్పనేమి టికి ? ఏమనిచెప్పవలెను ! అలసానివారి " జంత్రగాత్రముల ర్వాల్గరగించు విమల గాంధర్వంబు " గుఱించియా ! రామకృష్ణ కవీశ్వరుని రసజ్ఞతనా ! రామభద్ర కవి రచనా ప్రౌఢిమనా ? ధూర్జటికవి సారస్వత నందనమును గుఱించియా ? ఎవరిని గుఱించి ? దేనిని గుఱించి ? ఏమని వర్ణింపవలెను ? ఎంత వఱకు వర్ణింపగలము ?

నాటి తెలుగు కవితా వధూటి విశ్వకళామ తల్లికి కంఠ హారముల వేసినది. నాటి యాంధ్ర శిల్పి రాళ్లకు ప్రాణములు పోసి, వానికి మనోహర రూపము లొసగి, ఆ శిల్ప మూర్తు లచే భరత నృత్యములను జేయించినాడు. భావనా గీతికలను పాడించినాడు.

నాటి నాగార్జునుడొక నవ్య ప్రపంచమునే సృష్టించి నాడుగదా ! అమరావతి విద్యాలయమొక విశ్వకళా పరిషత్తు.

వివిధదేశములందలి విద్యార్థులకు విజ్ఞాన భిక్షుల ప్రసాదించిన సుజ్ఞానాంబుధి. ఆ విశ్వ విద్యాలయ మెంతటి విఖ్యాతి గాంచినది! వందలకొలది ఆచార్యులతో వేలకొలది విద్యార్థులతో విరాజిల్లిన నాటి విశ్వ విద్యాలయము తెలుగుతల్లి కీర్తి చంద్రికలను నేల నాలుగు చెఱగుల వెలిగింపజేసిన కళాపీఠముగదా!

పచ్చికలో గూడ ప్రాణములున్నవని ప్రపంచమున కెలుగెత్తి చాటిన నాగార్జు డెంతటి కరుణామూర్తి. ఆ దివ్యమూర్తి వెన్నవంటి గుండెలనుండి స్రవించిన దయారస ప్రవాహములు భూగోళమునే తడిపి వేసినవి కదా! హిమాలయముల కంటె మహోన్నతములైన ఆ మహనీయుని ఉన్నత భావములు, పసిఫిక్ మహాసాగరముకంటె అగాధములైన ఆ దయాశాలి అంతరంగిక హృదయముయొక్క లోతులు ఊహాతీతములు గదా! నాటి నాగార్జునుని విజ్ఞాన బీజములు మొలిచి పండిన నవానురాగములేగదా నేటి సజీవములగు తెలుగు నందనోద్యానములు!

తెలుగు కవితా క్షేత్రముల హాలముతో దున్ని తియ్యనిపలుకులను చల్లినాడు పోతన. అవి పదములై మొలిచి పాదములై పెరిగి, పద్యములై పూసి, భావములై విరిసి విజ్ఞాన వాసనలను వెదజల్లినవి విశ్వమంతటను. ఆ మహాకవి నాటిపోయిన కవితా మహావృక్ష స్కంధముల యాకులచాటున,

రెమ్మల మాటున గూయుచున్న కోకిలలెన్ని యోగదా! పలుకుచున్న చిలుకల సంఖ్యలు వేలుగావు ... లక్షలు!

మొల్లమాంబ కవనముల మల్లెల ఘుమ ఘుమలతో, ముద్దుపళని శృంగార కవితల సింగారంపు పూతల తొడుగులతో, వేంగమాంబ పదగుంభసల ప్రవిమల తారకల ధగధగలతో ఆంధ్ర సరస్వతి ఎంత ఆనందముగాంచినదో గదా?

తెలుగు మాగాణిలోనున్న వెన్ని కవనాల గనులో! కళా నందనములో! శిల్పసీమలో! త్రవ్విన ప్రతిచోట తరతరముల శిల్పసంపద తళుక్కున మెఱసి పోవుచున్నది. తాకిన ప్రతి శిలయు నృత్యగతుల నేర్పుచు అప్సరసల లావణ్యములను తీసి కట్టనుచున్నది.

చరిత్రకందని శాసనములు, పరిశోధనలకు దొఱకని శిల్పకళాఖండములు, ముద్రణకందని అపూర్వ కావ్య సంపుటములు ఎక్కడెక్కడ ఎన్నెన్నియున్నవో ఎవరికి తెలియును?

వేమన పద్యము లెఱుగని వెఱ్ఱి వాడెవడు? బ్రహ్మము గారి తత్వము పాడని పామరుడెవడు? తేట తెలుగు మాటలతో పరిమళ భావనా ప్రసూనముల మూటలతో, జిలిబిలి పలుకుల నీతులు చెక్కిన రతనాల పీటలతో తెలుగు కుటీర మెంతటి వెలుగు నిచ్చుచున్నది!

అది స్వర్ణయుగము. ఆంధ్రకవి సార్వభౌములు బంగారు పల్లకిలో నూరేగిన మధురాతి మధురమైన వసంతకాలము. తెలుగుశిల్ప సామ్రాట్టులు మనోహరమైన హంసతూలికా తల్పములలో తనువు మఱచి హాయిననుభవించిన వెన్నెల రోజులు.

అటు కటకమునుండి ఇటు ద్రవిడమాగాణము వఱకు దిగ్విజయములుచేసి జయ స్థంభముల నాటిన ఆంధ్రభోజుడు శ్రీ కృష్ణదేవరాయల నిర్యాణముతో నాంధ్ర మహాలక్ష్మి నానాటికి శుష్కించిపోయినది. చంద్రగిరి రాజుల చలువతో కొంతకు గొంత తెలుగుదనము నిలువ గలిగినను వన్నె దప్పినది. చెన్ను దఱిగినది.

ఆధారములేని అనాథవలె పోషకులులేని బికారివలె ఆంధ్రమాత చిక్కి శల్యావశిష్టయైనది. చైతన్యము లేక గత చరిత్రను తలంచుకొనుచు, భవిష్యత్తు నూహించుకొనుచు ప్రాణావశిష్టయై పోయినది.

తెలుగు తోటలో పిక సంతానములు కకావికలైనవి. విశ్వమునంతటి నుఱ్ఱూతలూగించిన మనోజ్ఞమైన కళాఖండ ములు ముక్క చెక్కలైనవి. జీర్ణదేవాలయములతో, శిథిల కుడ్యములతో, చితికిన శిల్పములతో, చివికిన చిత్రములతో

చిందర వందరయై పోయినది తెలుగు కళాక్షేత్రము. ఎటు చూచినను నైరాశ్యముస్వైర విహారము చేసినది. దారిద్ర్యము వికసించినది. తెలుగుయోధుల నాడులలోని నెత్తురు వేడితగ్గి పోయినది. ఉత్సాహము నశించినది. ఆవేశమ స్తమించినది.

ఆంధ్ర ప్రచండ భానుడ స్తమించినాడు. అమావాస్య గాఢాంధకారము చీకటి మూకలలో రాకాసి కేకలు వినిపించి నవి. అఖిలాంధ్ర జ్యోతి ఆరిపోయినదా ?

వెన్నెల కొన్ని రోజులు. చీకటి కొన్ని దినములు. విశ్వమూర్తి సర్వేశ్వరుని విచిత్రసృష్టిలో సంభవించెడు ప్రతి ఘట్టము చిత్రాతి చిత్రమేగదా! అఖండ భారతావని విముక్తి నిమిత్తమవతరించినది, స్వాతంత్ర్య మహోద్యమము. బాల గంగాధరతిలక్ మహాశయుడు పాడినాడు నాందీ గీతమును. అందుకొన్నాడు మహాత్ముడా మహాయజ్ఞ నిర్వహణమును.

భారత జాతీయ మహోద్యమము జగన్నాథ రథము వలె జయ ఘంటికలను ప్రమోగించినది. ఆ మహాయజ్ఞములో ఆత్మబలిదానము గావించిన మహావీరులెందరో తేల్చి చెప్ప లేము.

జాతీయ పోరాటముతోనే జనించినదాంధ్రోద్యమము. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణుడు నాటిన విత్తు మొలకై

వృక్షమై శాఖోప శాఖలై పల్లె పల్లెకు వ్యాపించినది. వాడ వాడకు ప్రసరించినది. విశ్వదాత కాశీనాథుని నాగేశ్వర రావు గారి విజ్ఞానసారస్వత సమారాధనముతో వికసించినది మహోద్యమము. దేశభక్త కొండా వెంకటప్పయ్య వెలిగించిన దివిటీలతో తొలిగిపోవుచు వచ్చినది గాఢ తిమిరావళి. ఆంధ్ర తేజము, ఆంధ్రశిల్పము, ఆంధ్రసారస్వతము. ఎటువిన్నను ఆంధ్రత్వము ప్రతిధ్వనించినది. పలుచబడిన రుధిరము ప్రజ్వలింప జొచ్చినది. నీరసించిన రక్తనాళములు ఉడుకెక్కినవి.

మహాత్ముడు పూరించిన సమర శంఖారావముతో నిఖిలాంధ్రము కుతకుతమనియుడికి పోయినది. బాపూజి ప్రారంభించిన ప్రతి యుద్యమమునందును ప్రథమ తాంబూల మాంధ్రులదే. దోగాడు పసిబిడ్డనుండి మూడుకాళ్ల ముదుసలి వఱకును స్వాతంత్ర్య సమరాగ్నియందురుకుట కువ్విళ్లూరిన వారే. కారాగారములు నిండిపోయినవి.

స్వాతంత్ర్యము సిద్ధించినదిగాని అది విభిన్న దృక్పథములతో పుట్టినది. మహమ్మదీయులకు ప్రత్యేకముగా పాకిస్తానము సృష్టించ బడినది. పరిశిష్ట భరతఖండము మనకు దక్కినది.

హిందూ, ముస్లిం సఖ్యతా యత్నమందే తన జీవి

తము సంకేతము చేసినాడు మహాత్ముడు. ఆ మహా ప్రయత్న మందే యసువుల నిడిచినాడు.

విశ్వకళా తపస్వి, మధురమయమూర్తి, కరుణా ప్రపూరితశక్తి మహాత్ముని నిర్యాణమునుండి దేశము కోలుకొనలేక పోయినది. ఆంధ్రనాయకుల దృష్టి భారతమాత ప్రాభవ పరిపుష్టి నిమిత్తమె కేంద్రీకరించ బడినది.

స్వరాజ్యము సిద్ధించులోపుగనే మహాంధ్ర జనని మహామాణిక్యములవంటి పుత్రులను పోగొట్టుకొన్నది. కళా ప్రపూర్ణ బిరుదాంకితుడు, విశ్వదాత, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు పరమపదించెను. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణుడస్తమించెను. ఆంధ్రోద్యమ పితామహుడు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు దివికేగెను.

ఈ త్రిమూర్తుల అస్తమయముతో మరల మునుపటి గాఢాంధకారముగాకున్నను సందె చీకట్లలముకొన్నవి. నిరాశా వల్లరులు కొనలుసాగినవి. నిస్పృహా బాహువులను చాచినది.

ఆంధ్రదేశము గొడ్డుపోలేదు. మహామంత్రులుగాకున్నను మంత్రులకు కొఱతలేదు. యుగంధరులు లేకపోయినను యుక్తిపరులకు కఱవులేదు. పెద్దవారు కొరతయైనను పెత్తనదారులకు తక్కువలేదు.

కాని ఒక్క లోటు కనిపించినది. ఆంధ్ర నాయకులలో ఐక్యభావము లడుగంటినవి. "ఎవరికి వారే యమునాతీరే" పదము నాలాపనముచేసినారు. కనుకనే ఆంధ్రులకు ఉన్న ఆశలు గూడ అడుగంటినవి. స్వరాజ్యము సిద్ధించినను స్వరాష్ట్రము లభించు దారి కనబడలేదు. ప్రజలలో నావేశమున్నప్పటికిని దాని నొకదారిలో నుంచు నాయకుడు కఱవైనాడు. ఉన్న నాయకులలో నాటుకొని పోయిన విభిన్నత్వమునుండి యేకత్వమును సాధించుట కెవరికిని శక్యము గాకపోయినది !

ఆశలుండియు నవకాశములేని సాహసముండియు సమర ప్రయత్నములేని సేనాపతులవలె తెలుగు యోధులు నిర్వీర్యులై పోయినారు. ఈ నైరాశ్య మేవిధమున పరిణమించునో గదా !



# అవతరణము!



విశాలాంధ్రమునకు నెల్లూరు మండలము గుండెకాయ వంటిది. అది విజ్ఞాన నిధులకు పుట్టినిల్లు. విద్యావేత్తలకు నిత్య నివాసము. కవితా నిధులకు జన్మస్థానము. కళోపాసకులకు మధుర నిలయము.

తన దివ్యమైన లేఖినితో తన మధురమైన భావములతో సానబెట్టిన వజ్రములవంటి పదజాలములతో మెఱుగు బెట్టిన రత్నములవంటి పాదములతో మహాజ్యోతులవలె వెలుగొందు మాణిక్యములవంటి పద్యములతో భారతమును రచించిన మహాకవి తిక్కన ఈ పినాకినీ తీర పరిసర ప్రాంగణము లందే వెలసెను గదా! "తింటేగారెలు తినవలెను. వింటే భారతము వినవలెను" అన్న నానుడి పుట్టిన దీ సింహాపురమునందే.

కవితిక్కనకు జన్మస్థానము. ఖడ్గతిక్కనకు నివాసము. కనుకనే కవికోకిలను ప్రసాదించిన దీ నెల్లూరు పత్తనము. కవి కోకిల దువ్వూరి కలములో కోటి కోకిలలు కాపురము చేసినవి. ఆ మహాకవి హృదయ కుహారమునుండి లక్షల భావనా స్రవంతులు పెన్నలై ప్రవహించినవి. సారస్వత నందనములో క్రొంగ్రొత్త సుమ వల్లరులను నాటి మధుర భావనామృతములు

పోసి కంటికి రెప్పవలె కాపాడి పెంచి పెద్ద చేసిన మహాను భావుడతడు. అందుకే ఆ మహాకవికి నిఖిలాంధ్ర జగత్తు నివాళు లొసగినది. కవిలోకము జేజేలు చెప్పినది. పండిత ప్రపంచము జోహార్లు సమర్పించినది.

విశాలాంధ్ర జగత్తునకు విముక్తిని ప్రసాదించిన శ్రీరాముల స్వస్థలముగూడ నెల్లూరుమండలమే. జన్మస్థానము మద్రాసునగరమైనను నివాసస్థానము నెల్లూరు మండలము లోని జువ్వలదిన్నె. జన్మించినది ఆర్యవైశ్యకులమైనను అఖి లాంధ్ర జాతికి నేకైక ప్రతినిధియైనాడు. హరిజన లోకమున కారాధనీయుడైనాడు.

మదరాసు మహానగరములో అణ్ణాపిళ్లై వీధిలో నున్న 163 వ నెంబరు గృహమందు జన్మించినాడు. మహా తపస్వి అకళంక ప్రజాసేవకుడు శ్రీరాములు జన్మించిన గృహము నిఖి లాంధ్రమునకు యాత్రాస్థలము గదా!

పూవు పుట్టగనే పరిమళించునటుల, తావి తాకగనే తనువు పులకరించునటుల కోకిల పాడగనే హృదయము విక సించునటుల తెలుగుతల్లి నోములపంట శ్రీరాములు ప్రభవింప గనే ప్రకృతి పరిమళించినది. శాంతి మహాసాగరములో చంద్రోదయమైనది.

దోగాడుచున్న దోసపండువలె పరుగిడుచున్న పనస పండువలె నిగనిగలీనుచు నెదుగుచున్నాడు పసికందు. అల్లారు ముద్దుగా పెరిగిన శ్రీరాములు అక్షరాభ్యాసము ప్రారంభించి నాడు. లోకోత్తర పురుషులకు అక్షరాభ్యాసము చేయించిన గురువులెంతటి పుణ్యాత్ములో గదా !

నాటి ప్రాథమిక విద్యాభ్యాసమునకు నేటి విధానమున కును హస్తిమశకాంతరమున్నది. అప్పటి విద్యార్థులు గురు శుశ్రూషచేసి విద్యనభ్యసించిరి. ఇప్పటి పల్లెకూటములలో శుశ్రూష కనిపించదు. విద్యతోఁబాటు శుశ్రూష వలన క్రమ మైన అభ్యాసములు బుద్ధులు అలవడునవి. ఇప్పుడు అట్టి అవ కాశములు తక్కువ. నలుబదిరెండవ సంవత్సరమునకు పూర్వ ము చదువుకొనిన విద్యార్థు లదృష్టవంతులు. వారి విద్యా భవ నము చక్కని పునాదులపై నిర్మింపబడినది. శ్రీరాములా కోవకుచెందినవాడే. వారి విద్యాభ్యాసము పెద్దబాలశిక్షతో ప్రారంభమైనది. సుమతిశతకకారుని సూక్తులు గ్రాహ్యమైనవి. గజేంద్రమోక్షము లోని పద్య రత్నములను వల్లించినాడు. బాలరామాయణములోని పటుతర శ్లోకములను పఠించినాడు. ఆటవిడుపురోజుల పద్యముల నొప్పగించుటలో నతడందెవేసిన చేయి. ముప్పాతికలనుండి మువ్వీసముల వఱకు, పాతికలనుండి కానీలవరకును లెక్కల పథకములను చెక్కుచెదరక చెప్పగల

మేధాశక్తి యలవడినది. ఇక ఎక్కములు నొప్పగించుటలో గలగల జలపాతము దివినుండి భువికి దిగినట్టులే. గణితమునకు మూలసూత్రము ఎక్కములే గదా! ఎక్కములు రాని వారి బుర్రకు నేనెక్క నను నట గణితశాస్త్రము. అమరము చదువని వారికి నేనమరననునట భాషామతల్లి. అనుభవజ్ఞులైన యొజ్జలు చెప్పిన ఈ మాటలలో నెంత భావ మిమిడి యున్నది. కవీశ్వరు లకు సహితము అమరము కల్పవృక్షము కదా!

ప్రాచీన విద్యా విధానమునం దుత్తీర్ణుడైనాడు శ్రీరాములు. అయోధ్యారాములవలె నల్లారు ముద్దుగా పెరిగిన శ్రీరాములున్నత విద్యాభ్యాసమునకు గడంగినాడు. ఎదుగు చున్న వృక్షమును చూచినపు డెవరికైనను సంతసమే గదా! శ్రీరాముల పసిడినాల్కలో పలుకుల వెలది స్థిర నివాస మేర్పఱచుకొన్నది. కనుకనే ఉన్నత విద్యలు వెన్నతో బెట్టిన చదువులైనవి. తరగతిలో ప్రప్రథముడుగాకున్నను ప్రథమ శ్రేణినుండి తప్పువాడుగాడు. భావినాయకుల భవిష్య చ్ఛాయలు విద్యార్థి దశలోనే ప్రతి బింబించు ననుట తప్పుగాదు. భారత రిపబ్లికు అధ్యక్షులైన రాజేంద్రుడు ప్రతి తరగతి యందును ప్రతి పరీక్ష యందును ప్రథమ శ్రేణిలో ప్రథముడుగా వచ్చుచుండెడి వాడట. ఆ మహనీయుని మేధా శక్తిని పరికించిన వివేకా నందుని శిష్యురాలు సోదరి నివేదిత "ప్రసాదు భారతావని

భవిష్యన్నాయకుడు కాగలడని" వక్కాణించినదట. అదే విధముగనే శ్రీరాముల ప్రజ్ఞను పరిశీలించిన పండితులితడు మహాకవియో మహాసాధువో కాగలడని వ్రాకుచ్చినారు. శ్రీరాములు మహా పండితుడు మాత్రమేగాదు మహా సాధువు మాత్రమే గాదు మహాత్ముడైనాడు.

కొండవీటి చేత్రాడువలెనున్నత విద్య ఆఱు సంవత్సరము లభ్యసింపవలసియున్నది గదా! శ్రీ రా ము ల కి ది చా ల విసుగును బుట్టించినది. కనుకనే ప్రాచీన సారస్వతపుగనులను పరిశోధింప నారంభించినాడు. పురాణములను పఠింప నారంభించినాడు. తిక్కన తియ్యందనాలను చవిచూచినాడు. పోతన మధుర భావనామృత సమీరములలో విశ్రాంతి ననుభవించి నాడు. త్యాగయ్య గాన వృష్టిలో ఆపాదమస్తకము తడిసినాడు. సారస్వతనందన మంతయును కలయ దిరిగి మొల్లమాంబ వన్నె చిన్నెల కవితా చంద్రికలలో విహరించి వేమన పదముల నుచ్చ రించుకొనుచు బ్రహ్మయ్య తత్వముల పాడుకొనినాడు.

శ్రీరాములకు గ్రంథాలయమన్నచో గాఢాభిమానము. గంట కొట్టు వఱకు పాఠశాల. కొట్టినది తడవుగా గ్రంథాలయ మునకు పరుగుదీసెడివాడు. కనబడిన పుస్తకమునెల్ల చదివిననే గాని తృప్తియుండెడిది కాదు. ఏయే పాత్తము నందెంతెంత విద్యా విత్తమున్నదో సంగ్రహించి తీరవలె ననెడు దీక్ష.

ఆదీక్షకుమించిన ఆసక్తి. విద్యాతృష్ణ సామాన్యముగా తీరెడిది కాదు గదా! తరచినకొలది తరుగనిది సారస్వతనిధి గదా! "నేనున్నత విద్యచదివితిని." "ఏను పట్టభద్రుడను" అనెడు సంతృప్తిలో ఫలితమేమున్నది? విద్యకు పట్టములు పరీక్షలు తరగతులు ఇవన్నియు తాత్కాలికపు కొలమానములే గదా? పోతన యే తరగతి చదివెను? ఆ మహామహులు సృష్టించిన సారస్వత ప్రపంచముల కంచులు దెలియక వెదకులాడు చున్నాము గదా! విద్యార్థులకు తరగతి పాఠములే ప్రపంచము కారాదు. బడికి వెలుపల విశాల ప్రపంచమున్నది. విజ్ఞానాంబుధులున్నవి. ఆప్రపంచ జ్ఞానార్జనము నిమిత్తము ప్రయత్నించవలెను.

బాలవిద్యార్థి శ్రీరాముడటువంటి ప్రయత్నమునే చేసినాడు. భారత దేశీయ చరిత్రను పరిశోధించినాడు. గుప్తుల నాటి స్వర్ణయుగమును తలచుకొని తనువును మఱచినాడు. గౌతముని కన్నతల్లి భారతమాతయని తెలిసికొని గర్వముతో గంతులువేసినాడు. అశోకుని పరిపాలనను చదివి ఆనందపడినాడు. సంగమిత్ర సాహసమును, బౌద్ధమత ప్రచారమును పఠించి పులకరించినాడు.

తాజమహాల్ నిర్మాణమును చరిత్రలో తిలకించి ముక్కుమీద వ్రేలుంచుకొనినాడు. శివాజి విక్రమమును స్మరించుకొని

పొంగిపోయినాడు. చివరకు ఆంగ్లేయుల చరిత్రను చదివి సల సలమని పొంగిన రుధిరముతో మండి పడినాడు.

మరొకవైపున మహాంధ్ర చరిత్ర నంతయును వల్లించినాడు. తెలుగుతల్లి సామ్రాజ్య వైభవమును స్మృతికి దెచ్చుకొని మధురాను భూతిని పొందినాడు. శిథిలమైన జీర్ణ విజయనగరమును గాంచి ఖిన్నుడై నాడు.

నాడే ప్రభవించినది శ్రీరాముల హృదయసీమలో స్వాతంత్ర్యాంకురము. విద్యార్థిదశలోనే మొలకెత్తినదా వాంఛ. భారతమాత బంధనములను విడిపించవలెను. ఆంధ్ర శ్రీ పాశములను త్రుంచవలెనను పట్టు జనించినప్పటికది విద్యార్థిదశ. విజ్ఞానార్జనమే విద్యార్థి ధర్మము. రాజకీయము లందు పాల్గొను నాశలు జనించు కాలమైనప్పటికిని దానికి సమయమురావలెను. అందుకొఱకే శ్రీరాములు మనశ్శాంతి తో చిఱుత ప్రాయమునందే యున్నత విద్యను పూర్తిచేసినాడు.

పిన్నల చదువులలో వృద్ధి కనిపించినపుడు పెద్దలలో నుత్సాహముద్భవించుట సహజము. ప్రతివత్సరమును తప్పక కృతార్థుడగు విద్యార్థిని చదివించుటకే జననీ జనకులు పూను కొనరు?

శ్రీరాముల కుటుంబము సిరిసంపదలతో తేలిపోక

పోయినప్పటికిని కూటికి గుడ్డకును కొదవలేదు. సోదరుడు రంగయ్యగారి చదువుతో పాటుగనే శ్రీరాముల చదువు కూడ సాగవలెననుకొన్నారు. ఒక శుభముహూర్తమున కళాశాలలో ప్రవేశపెట్టినారు.

విశ్వమునకు నేత్రములవంటివి విద్యాలయములు. అందు కళాశాలలు జ్ఞాన చక్షువులు. శ్రీరాముల దృష్టి కళాశాల విద్యార్జనతో బాటు మఱల విజ్ఞానార్జనము పై బడినది. విశ్వచరిత్రను కదిపిచూచినాడు. వివిధ దేశముల స్వాతంత్ర్యోద్యమ చరిత్రలను పరిశీలించినాడు. అమెరికా స్వాతంత్ర్య సమరములు శ్రీరాముల నెక్కువగా నాకర్షించినవి. అబ్రహాం లింకన్ జీవన గాధను పఠించి తన్మయుడైనాడు. న్యూటన్ మహాశయుని పరిశోధనా సక్తిని చదువుకొన్న కొలది యు నాశ్చర్యమువేసినది. నీగ్రోల బానిసత్వమును దలంచుకొని విలపించినాడు. ఆంధ్రభాషతో పాటు నాంగ్లభాషలో గూడ మంచి గ్రాహ్యశక్తి యలవడినది. బెర్నార్డ్‌షా విచిత్రపాత్రలు, షేక్స్‌పియర్ కథానాయకుల మనస్తత్వములు, ఇబ్సన్ వాస్తవిక చిత్రణములు శ్రీరాముల నాకర్షించినవి.

పాఠశాల కేగుచున్నప్పుడే జాతీయోద్యమము ప్రారంభమైనది. హృదయ మావేశముతో నుడుకెత్తిపోయినది. కాని కుటుంబము పెద్దలు బంధువులు తన్నెంతయో యాసతో

చదివించుచున్నారు. పెద్దచదువులు చదిని గొప్ప ఉద్యోగములు చేయగలడను నాస వారికుండుటలో నబ్బుర మేమున్నది?

ఎంత ప్రయత్నించినను మనసు స్వారాజ్యోద్యమము వంక కే పరుగిడుచున్నది. విద్యార్జనమా ? రాజకీయమా ? రెండు సమస్యలును హెచ్చు తగ్గులులేని, బరువు తేలికలులేని సరి తూకములు.

విశ్వప్రేమైక మూర్తి దీనజన బాంధవుడు దేశనాయకుడు గాంధీ మహాత్ముడు జగన్నాధ రథమును కురుక్షేత్రమునందు నిలుపుకొనినాడు. పాంచ జన్యమును పూరించినాడు. ఆసేతు శీత నగమూగిసలాడి పోవుచున్నది. విద్యార్థి ప్రపంచము సరి హద్దుల నధిగమించి విప్లవ మహాసముద్రములోని కురుకుచున్నది.

ఆలోచించినాడు శ్రీరాములు. విజ్ఞానార్జనమా? స్వారాజ్య సాధనమా ? ఏది ముందు ? పెద్దలు పలువిధములుగా సలహాలిచ్చినారు. ఆత్మ మహాత్ముని వైపునకు లాగుచున్నది. పాదములు పాఠశాలవైపునకు లాగుచున్నవి.

ఒక వంకనుద్యమము సాగుచుండగనే మరొక వంక చదువుసాగుచు వచ్చినది. శానిటరీ ఇంజనీరింగు పరీక్షలోను తీర్ణుడైనాడు శ్రీరాములు.

మానవ జీవితము మిక్కిలి సంక్షుభిత మైనది. ప్రజాసేవ విధ్యుక్త ధర్మమైనప్పటికిని ప్రగతి శీలము సహజముగా నుదయించు సునిశితభావమైనప్పటికిని పరోప కారవాంఛ మానవుని ప్రకృతి యైనప్పటికి నవి వికసించు నవ కాశములు గలుగుటరుదు. శ్రీరాముల వాంఛ యుద్యోగము చేయుటగాదు. ఆమహానుభావున కేదియో మహత్తరమైన కార్యమును సాధింపవలెననెడు కోరికయుండెడిది. ఏదో గురుతర బాధ్యత నిర్వహించు నిమిత్త మీ ప్రపంచిమునందుదయించి నానను నమ్మకముండెడిది. కాని యుగధర్మము ననుసరించి కుటుంబ న్యాయము ననువర్తించి తానుగూడ నుద్యోగము చేయవలసి వచ్చినది.

1920 వఱకు శ్రీరాముల జీవితము వసంతకాలము. అది విద్యార్థి దశ. మానవజీవిత మందేవైనను తియ్యని నిముసము లున్నచో నవి విద్యార్థి దశ యందుండవలెనన్నాడొక మహా కవి. శ్రీరాముల జీవితములో విద్యార్థి దశ పరి సమాప్త మందినది.

ఆ విలువైన కాలమందు విజ్ఞాన వారాశిని కలయ వెదకి కావలసినన్ని సుజ్ఞాన ముత్యముల నేరుకొన్నాడా జిజ్ఞా సువు. చరిత్రలను పరిశోధించి మహాపురుషుల జీవితగాథల నాకళింపుచేసికొనినాడా చరిత్రార్థుడు. ఆంగ్లాంధ్ర భాషలం

దపారమైన పాండితి నార్జించుకొనినాడు. మత గ్రంథములను క్షుణ్ణముగా చదివి సర్వ మతాన్వయసూత్రమును సాధించు కొనినాడు. జీసస్ రక్తదానము, గౌతముని రాజ్య పరి త్యాగము, శ్రీరాముని వనవాసము, హరిశ్చంద్రుని కాటి కాపరి తనము లెందు నిమిత్తమో గ్రహించుకొనినాడు.

ఇక కావలసినదేమున్నది! గ్రహించిన విజ్ఞానముతో ప్రపంచమున వ్యవహరించుటయే కదా ? సంగ్రహించిన విద్యతో సమర్థతతో జీవనయాత్రను సాగించుటయే గదా ?

జి. ఐ. పి. రైల్వేలో నుద్యోగము లభించినది. జీతము రెండువందల యేబది రూప్యములు.

" పోల నుద్యోగికిని దూరభూమిలేదు " అన్న కవి వాక్కులో నాశ్చర్యములేదు. ఎక్కడ ఆంధ్ర దేశము? ఎక్కడి బొంబాయినగరము ? శ్రీరాములు బొంబాయిలో నివాస మేర్పఱచుకొనినాడు. పరిసరములు క్రొత్తవైనను పరిచయము చేసికొనినాడు. వేషము, భాష వేఱయినను వారుగూడ భారతీయులే యను భావముతో కలిసి మెలసి కాపురము చేసినాడు.

ఆ మహానగరములో ననుభవములకు తక్కువయుండదు గదా ? నూనూగు మీసల నూత్న యౌవనమువ బహు జాగ

రూఢతతో బ్రహ్మచర్యమును కాపాడుకొనినాడు. వినయము వివేకము శీలము మానవునికి దైవ ప్రసాదములు. ఆ మహా లక్షణముల నభివృద్ధి పఱచుకొన్న మానవుడు మహాత్ము డగుటలో వింత యేమున్నది?

తీరిక యున్నప్పుడెల్లను శ్రీరాములు కార్మికుల కష్ట సుఖములను పరిశీలించినాడు. దేశ నాయకుల ఉపన్యాసములను వినుచును ప్రతికలలో చదువుచును తనకెప్పుడా మహాత్ముల సాంగత్యము లభించునాయని యువ్విళ్లూరినాడు.

జీవిత నాటకరంగములో వివాహ ఘట్టమొక ప్రత్యే కాంకము. నవ వసంతములో వెన్నెల రాత్రులలో తియ్యని నిముసముల ప్రసాదించెడు మధుర ఘట్టము. వంశ మర్యాదల ననుసరించి శ్రీరాముల వివాహము నిరాడంబరముగనే జరిగినది. అనుకూలవతియైన పత్ని లభించినచో వేరొక స్వర్గము కావలెనా ?

సంసార బంధమేర్పడి నప్పటికిని శ్రీరాములు కుటుంబ మను సంకుచితత్వమునందే చిక్కుకొని బాహ్య ప్రపంచమును మఱచిపోలేదు. వివాహ ఘట్టమతని హృదయమును మఱింత విశాల మొనర్చినది. జీవితమునందలి యానందమును చవిచూచి నప్పటికిని సంఘ కళ్యాణాసక్తి యడుగంటక మఱి రెండాకులను విడుచుట విచిత్రము గదా ?

ఉద్యోగ మొక్కొక్కప్పు డతిభారముగా కన్పించు చుండెడిదట. అయినప్పటికి నధికారుల మన్ననలకు కొదువ లేదు. సహచరు లతిప్రేమతో చూచుచుండెడివారు. తన విధ్యుక్త ధర్మమునందే కొంతయు రానీయక నత్యంతము మెలకువతో సమస్తము నిర్వహించుకొనుచుండెడు వాడు.

శ్రీరాముల జీవిత ముద్యోగ రంగమున నాలుగు సంవత్సరములు గడచినది. సాధారణ మానవుని జీవితమునందే మార్పు లసంఖ్యాక ములై నపుడిక మహాపురుషుల జీవిత చరిత్ర లెన్ని సంపుటములుండునో గదా!



# ఆ చ ర ణ!

భారత స్వాతంత్ర్యచరిత్రలో నవ శక మారంభమైనది. ఆ నేత శీతనగము తిలకు మహాశయుడు వెదజల్లిన విప్లవ బీజములు మొలకలెత్తినవి. ఉద్యమశీలుడైన భారత కృషీవలుడు మహాత్ముడా యంకురముల వాడిపోనీయక నీరుపోసినాడు. అవి రెండాకులు విడిచినవి. భారతనేతలు తమ గమ్యస్థానమువైపునకు దృష్టిని సారించినారు. రౌలట్ చట్టము, ముద్రణ శాసనము, ఆయుధచట్టమువంటి నిర్బంధ శాసనములను రద్దుచేయవలెనని పట్టుబట్టినారు.

కార్మికుల రక్తమాంసములతో కోట్లకొలది లాభములను గడించుచుండిన పెట్టుబడిదారుల దోపిడీ విధానము సరికట్టవలెనని ఆందోళనము ప్రారంభించినారు. స్వదేశీ పరిశ్రమలకు తగినంత రక్షణ, ప్రోత్సాహములు కావలెనని ప్రకటించినారు. ప్రభుత్వయంత్రమందలి ప్రతిశాఖయందు ననవసరపు ఖర్చులు తగ్గించవలెనని గట్టిగా హెచ్చరికలు చేసినారు.

జాతీయ భాషను నిర్ణయించి సంఘీభావ వికాసమునకు పూనుకొనవలయునని కోరినారు. రూపముచెడి, సంస్కృతి చెదరి, పటుత్వము తగ్గి, నానాటికిని కళతరిగి పోవుచుండిన భాషారాష్ట్రములను పునర్విభజన చేయవలెనని ఎలుగెత్తి

చాటినారు. ప్రజలలో దారిద్ర్యమును, అవినీతిని పెంపొందింప జేయుచుండిన మద్యపానమును శాసనరూపమున నిషేధించ వలయుననియు, విద్యావిధానములో విప్లవమును తీసికొని రావలెననియు, వయోజనుల కందరికిని వోటు హక్కు నివ్వ వలెననియు, బహిరంగముగా ప్రకటించినారు

భారత నాయకులయొక్క న్యాయమైన కోరికలను తీర్చుటకు విదేశ ప్రభుత్వము సమ్మతించకపోయినది. దమన నీతితో దౌర్జన్య పద్ధతులతో, దుష్టములైన కుట్రలతో, కుటిల రాజనీతితో భారత దేశపు సిరి సంపదలను దోచుకొను దొరల కోర్కెలు కంటిలో పుల్లలు పెట్టినట్లు తోచినవి. జాతీయ నాయకుల హెచ్చరికల నాలకించకయే తమ హింసా విధానముతో భారత స్వాతంత్ర్య మహోద్యమము నడచి వేయ గడంగినది దొరతనము.

పౌరుషముల కాటపట్టయి భారతజాతి ప్రచండోద్వేగముతో పైకి లేచినది. ఆ యసహాయోద్యమ మహా ప్రవాహము శీతనగమును చెంగలించినది. కన్యాకుమారిని కౌగిలించినది. వింధ్యాద్రిని ముంచియెత్తినది. పాంచాలమండలి యువలోకము ప్రజ్వలించినది. బొంబాయి విద్యార్థులు విప్లవముతో పొంగిపోయినారు. సంయుక్త రాష్ట్రమంతయు అహింసా మహాసమరాగ్నిలో సమిధలను వ్రేల్చినది. దేశబంధు చిత్తరంజి

నుని పిలుపునందుకొన్న విద్యార్థులు పరీక్షలకే విడాకుల నిచ్చి నారు. కాశీఘట్టము, పాటలీనగరి, తదితర ప్రాంతములందు జాతీయ కళాశాలలు ప్రభవించినవి.

తమ వృత్తులను త్యజించి భారత స్వాతంత్ర్య సమర మందు సైనికులై ముందు నడచిన న్యాయవాదులనేకులు. అసహాయోద్యమ మహాప్రవాహమందు విప్లవోద్వేగములో విజయోత్సాహముతో పాల్గొన్న యువ కిశోరములు వేలాది వేలుగదా !

విదేశీయ వస్త్ర బహిష్కరణము, ఖద్దరు ఉత్పత్తి నాటి జాతీయ కార్య క్రమమందలి ప్రధానాంగములు. దౌర్జన్య రాహిత్య సిద్ధాంతముతో శ్వేతజాతి ఘోర దురంతముల నెదుర్కొన్నది భారతావని. ప్రపంచ దృష్టి నాకర్షించినది పన్నుల నిరాకరణోద్యమము.

అఖండ భారతములో నిర్విఘ్నముగా సాగిపోవు చున్నదసహాయోద్యమము. ఆ మహా విప్లవమునందు సంతోష సంభ్రమములతో పాల్గొన్న దాంధ్రదేశము. "ఆంధ్ర రత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అత్యంతాసక్తితో దీక్ష వహించినాడు. అసహాయోద్యములో క్రొత్త ఘట్టమును చరిత్ర విస్మరించలేని వినూత్నాధ్యాయమును సృష్టించినది చీరాల. ప్రభుత్వాజ్ఞల ధిక్కరించి పది మాసములు పట్టణమునకు

వెలుపల గుడిసెలలో నివసించినారు చీరాల ప్రజలు. స్వగృహ ముల విడనాడి, స్వంతమైన హక్కులను వదలుకొని జాతీయ గౌరవ ప్రతిష్ఠల కొఱకు సర్వస్వమును త్యాగముచేయుటలో తెలుగువారెవరికి తీసిపోరు గదా !

ఇంతలో నడుగుపెట్టినాడు వేల్సు యువరాజు భారత భూమిపై. రాజ సందర్శనమును బహిష్కరించుటకు పూను కొనినారు భారత ప్రజలు. బొంబాయి నగరమున యువరాజు కాలిడుట తోడనే పోలీసుల "జులుం" ప్రబలమైపోయినది. బహిష్కరణోద్యమములో పాల్గొనిన ప్రజలపై లాఠీలు స్వైరవిహారము సల్పినవి. మర ఫిరంగులు మారుమ్రోతలిడినవి. నెత్తురు వరదలై ప్రవహించినది. మహాత్ముడే స్వయముగా ప్రజలలో ప్రవేశించినప్పటికిని మహోద్రేకము చల్లారలేదు.

దేశమందు జరుగుచున్న మహా విప్లవమును తిలకించి నాడు శ్రీరాముడు. రక్తము జ్వలించినది. నరము లుప్పొంగి నవి. హృదయము ప్రజ్వలించినది. స్వాతంత్ర్యము లేని జీవనము నిరర్థకమని అంతరాత్మ హెచ్చరించినది.

తన ప్రేయసి గతించిన వెనుక తన జీవితములో వైరాగ్యదశ అంకురించినది. అసహాయోద్యమము, మహాత్ముని సందేశము, భారతమాత యాక్రందనము, మనస్సును మార్చి వైచినవి.

ఏదో పిలుపు వినబడుచున్నది. ఎక్కడో విజయ దుందుభులు మ్రోగుచున్నవి. ఎవరో దివ్యమూర్తి దీవెనలు కురిపించు చున్నాడు.

ఒక వైపున కనబడుచున్నది కుటుంబము. మరొక వైపున విలపించుచున్నది అస్వతంత్ర భారత జనని. ఏది ముందు? ఏది వెనుక? ఏది కర్తవ్యము? హృదయసాగరమున నుదయించిన ప్రశ్న పరంపరలు తరంగములై కల్లోలమును రేకెత్తించినవి.

బానిసలై భక్షించు పాయసాన్నముల కంటెను స్వాతంత్ర్యమున ద్రావు జావ మేలు గదా! బందీయై చేయు నుద్యోగము కంటెను, స్వాతంత్ర్య సమరభూమియందు సమాధి నొందుట సమంజసము గదా?

కనుకనే త్యజించినాడు సమస్తమును శ్రీరాములు. బంగారమువంటి వృత్తిని కాలదన్ని జాతీయోద్యమములో ప్రవేశించినాడు. తాను ప్రజాసేవా కార్యరంగమునందు ప్రవేశించు చున్నానని సోదరున కొక లేఖ వ్రాసి సబర్మతీ ఆశ్రమమున గాంధీజీ శిష్యుడైనాడు.

విశ్వమూర్తి గాంధీజీ నివాస మొక శాంతి నిలయము. బంగారు బాపూజీ పాదమూనిన ప్రదేశమొక పుణ్యక్షేత్రము.

మహాత్ముడు విహరించిన పొలములు సాబ్రాత్ర నందనములు. అందు కే సబర్మతీ ఆశ్రమమొక స్వర్గసీమ. స్వర్గాధిపతి భోగ లాలసుడు దేవేంద్రుడు. సబర్మతీ తపస్వి గాంధీ మహాత్ముడు త్యాగఘనుడు. అది అప్సరసల క్రీడారంగము. ఇది శాంతి దూతల సేవారంగము. అది భోగసీమ. ఇది త్యాగసీమ. అచట నివసించువాడు సంపన్నుడు. ఇచట వసించువాడు దరిద్ర నారాయణుడు.

జానెడు గోచితో జగత్తును తన్మయత్వమున నింపుచున్న మోహనదాసునకు, మణిమయ మకుటంబులతో, విరాజిల్లు చున్న సహస్రాక్షునకు ఏమి పోలిక ?

చిరునగవుల తొలకరింతలతో. సేవాభావనల పులక రింపులతో, శాంతి వచనముల చిలకరింతలతో, కలకల లాడు చున్న సబర్మతి స్వాగత మిచ్చినది శ్రీరామ మూర్తికి. గాంధీ మహాత్ముడు నిరాడంబర జీవి. వారి జీవితమునం దాడంబరము కలికమునకైనను గన్పించదు. బాపూజీ పాదచ్ఛాయలలో పయనమైనాడు శ్రీరాముడు. జీవిత మశాశ్వతమైనది. శ్రీరాములీ సత్యము నేనాడో గ్రహించినాడు. కనుకనే తన యావజ్జీవమును దీన జనుల సేవా కార్యక్రమమునకై విని యోగింప తలపెట్టినాడు.

తలలో నాల్కవలె సబర్మతియందలి సహచరుల యను రాగముల కొల్లగొనినాడు. తనకు నియోగించిన సేవా కార్య క్రమముల నోపికతో సంతోషముతో చేయుచుండెడు వాడు. తన సేవా నిరతిని తదితరులు ప్రశంసించు చుండగా వినుటకు నైన నిచ్ఛగించెడు వాడుగాడు. తన కర్తవ్యము తాను చేయు చుంటినని సమాధానము చెప్పుచుండెను.

ఆశ్రమవాస మత్యంత నియమ బద్ధమైనది. క్రమ శిక్షణ యుతమైనది. సాధారణమానవు డందుకొనరానిది. శ్రీరాము డట జీవించినాడు. జీవించుటయేగాదు జీవితమును సార్థకము చేసికొనినాడు. మహాత్ముని యనురాగమును చూరగొనినాడు. ఇట్టి త్యాగధనులు మఱి పది మంది యున్నచాలు. స్వరాజ్య మొక్క సంవత్సరములో నూడిపడదా!

శాంతి నిలయమైన సబర్మతియందు మహాత్ముని శిష్యత్వము శ్రీరాముల జీవిత నౌకకు చుక్కాని యైనది. విశాల భారతమాత బానిస బంధనముల తెగద్రుంచుటయే నాటి భారతీయుల పట్టుదల. భారత జాతికి విమోచనము ప్రసాదించుటయే మహాత్ముని నిశ్చల దీక్ష. నిరంతర తపస్సు.

ప్రారంభమైనది స్వరాజ్య సమరము. ప్రపంచ చరిత్రలో కని విని యెఱుగని వినూత్న విప్లవము. నిరాయుధులైన సేనా

వాహినులతో దండెత్తినాడు మహాత్ముడు. గౌతముని కరుణా హృదయముతో, విశ్వకల్యాణమునకై రక్తదాన మొసగిన జీసస్ ప్రవక్త ధర్మపథములో, హరిశ్చంద్రుని సత్యసంధతతో శ్రీరాముని న్యాయశీలతతో సమరమును ప్రకటించినాడు గాంధీ మహాత్ముడు.

అహింసా సిద్ధాంతమొక వంక, ఆరని పౌరుష జ్వాలలు మరొకవంక. రెండింటికిని పొత్తు కుదుర్చిన మహానుభావు డెవరు? కుదిరిన ఘట్టమెందు గలదు? అది గాంధీజీ యుగము నందే సాధింపబడినది. మహాత్ముని సిద్ధాంతమునందే జనించినది.

భయంకర ఫెళఫెళార్భటులతో భూ నభోంతరాళముల బ్రద్దలుచేయు "బాంబు" లెక్కడ! నిరాయుధులై సమర భూమిలో నిలబడిన స్వచ్ఛంద సేవకు లెక్కడ! ప్రళయ పర్జన్య గర్జలతో నంతరిక్షమును చిల్లులు పొడుచు విమానము లెక్కడ! కొయ్యరాట్నములు త్రిప్పుకొనుచు పోగులుతీయు పూజారు లెక్కడ! దౌర్జన్య రక్కసితో శాంతిదేవత తలపడినది. హింసతో అహింస ఢీకొన్నది. అధర్మముతో ధర్మము పోరాటము సాగించినది.

సత్యా సత్యములకు సంఘటిల్లిన భయంకర సమరములో శ్రీరాము లోక సామాన్యుసై నిలుడై నాడు. ఫలితముగా లభించి

నది కారా గారవాసము. నాటి కారాగారములు ప్రత్యక్ష నరక కూపములు. వందలు వందలుగా మందలు మందలుగా గదుల నింపిరి నాటి దొరలు. గాలిదేవుడు నడుగిడ జాలని గదులు, గబ్బిలముల నివాసములు. మట్టి గడ్డలతో మిళిత మైన యన్నమునే బ్రహ్మానందముతో స్వీకరించినారు భారతీయులు.

ఆ సేతు హిమాచలమే చెఱసాలగా భావించబడిన నాటి దినములలో కారాగార మనగా కంపించువారెవ్వరు? నిత్య దారిద్ర్యముతో నిట్టుపాసములతో, నిరాశా నిస్పృహాల యావేదనములతో పెనగులాడుచుండిన ప్రజలకు చెఱసాల నివాసమన్న భయమెక్కడిది ?

శ్రీరాములకు విప్లవమున కంటెను నిర్మాణమున నాసక్తి మెండు. సాయుధ విప్లవముపై నతనికి నమ్మకములేదు. అహింసాయుతమైన పోరాటముపై విశ్వాస మధిక మైనను నిర్మాణముతోనే స్వాతంత్ర్యము సాధించగలమను పట్టుదల మెండు. కారాగారమందు నూలువడుకుట, అస్పృశ్యతా నివారణము, మద్యపాన నిషేధమును గుఱించి సహచరులతో చర్చలు సాగించెడువాడు. అను దినము నూలుతీయుట నొక నియమముగా నుంచుకొనినాడు.

చెఱసాలనుండి విడుదలైన దే తడవుగా నిర్మాణరంగ మున ప్రవేశించెడువాడు. వెన్నెల చాలువలె సన్నని నూలుతీయుటన్నవారికి మంచినీళ్ల ప్రాయము. నిర్భాగ్యులై నిరక్షరాస్యులై, తరతరములుగా యుగయుగములుగా దారిద్ర్య కూపమున మ్రగ్గుచున్న హరిజన సోదరులకు సేవ చేయుటన్న వారికి పరమానందము.

నిత్యము ఖద్దరు ధరించి నియమబద్ధుడై, నిరాడంబర జీవనుండై, నిర్మాణరంగమున చుఱుకుగా కార్యక్రమమును సాగించిన శ్రీరామునిగాంచి పొంగిపోయినది భారతదేశము. దేశము విశాలమైనది. సేవారంగమంతకంటెను కడు విస్తృత మైనది. దాస్యశృంఖలా విచ్ఛేదన మహాయజ్ఞములో నొక్క సమిధయగుటకు సన్నాహ పడినాడు శ్రీరాముడు.

నిర్మాణరంగమునుండి కారాగారమునకు కారాగారము నుండి విశాల ప్రపంచమునకు. మరల చెఱసాలకు ఈ విధము గనే మూడుమాఱులు చెఱసాల కేగినాడు శ్రీరాములు. అత్తవారింటికి వెళ్లు పెండ్లికొడుకువలె నానందముగా కారా గారమునకు వెళ్లుట నాటిత్యాగపురుషుల లక్షణము. శ్రీరాము డందుకు విలక్షణముగా నడచుకొనలేదు. అతడు వైరాగ్య సంపన్నుడు. మహాత్ముని అంతే వాసి. సబర్మతీ నివాసి. మూర్తీభవించిన ఆంధ్రత్వము.

పోరాటము జరుగుచున్నది గాని స్వాతంత్ర్యము దూర మగుచున్నది మహాత్ముని స్వాతంత్ర్య పోరాటము క్రొత్తరీతుల ద్రొక్కినది. కట్టుదిట్టములతో పట్టుబిగువులతో నడుప దలచు కొన్నాడు సత్యాగ్రహ సమరమును. సామూహికములగు పోరాటముల కంటెను వ్యక్తి సత్యాగ్రహములందలి మహత్తర శక్తిని విశ్వమునకు చాటవలె ననుకొన్నాడు మహాత్ముడు. అందులకు తగిన పథకముల నాలోచించినాడు. చక్కని సత్యాగ్రహ సమరయోధుల నెన్నుకొనినాడు. ఆ మహా కురుక్షేత్ర యుద్ధమునకు మొదటి సేనాని ఆచార్య వినోభాజీ. ఆవెనుకటి అతిరథ మహారథులలో మన శ్రీరాముడొకడైనాడు.

విశ్వమూర్తి శంఖారావముతో మేలుకొన్నది భారతావని. భారతభూమియందలి ప్రత్యణువు "స్వాతంత్ర్యము" "స్వాతంత్ర్యము" అని యాక్రోశించినది. నలుబదికోట్ల భారతీయుల యనుమతిలేకయే వారి మనోభీష్టమునకు విరుద్ధముగ భారతదేశమును ప్రపంచయుద్ధమున, దింపినదప్పటి ప్రభుత్వము. అది ఘోరమైన తప్పిదమని మందలించినాడు మహాత్ముడు. ఒక్క సన్యాసి మాటలకు విలువనిచ్చుట పరాభవముగా భావించినాడు చర్చిల్. తత్ఫలితముగ ప్రజ్వలించినది భారత పౌరుషాగ్ని. వ్యక్తి సత్యాగ్రహ సమరము ప్రపంచదృష్టి నాకర్షించినది. అవకాశము కొఱకట్టులు చాచినారు భార

తీయులు. మహాత్ముని యనుమతి నిమిత్తము వేలకొలది కదన యోధులు కాచుకొని కూర్చున్నారు.

ఆ మహా యోధులలో మన శ్రీరాములొకడు, విజయమో వీరస్వర్గమో యన్న దృఢనిశ్చయముతో ముందు నిలిచినాడు. గాంధీజి అమృత వాక్కులతో నాశీస్సుల వర్షము కురిసినది.

భారతీయుల మనోవాంఛితమునకు వ్యతిరేకముగ దేశమును కదనమందు దింపిన బ్రిటిష్ ప్రభుత్వము తప్పటడుగు వేసినదని యెలుగెత్తిచాటినాడు శ్రీరాముడు. ఈ నాలుగు పలుకులు చాలు. నాటి సమరమునం దివే వజ్రాయుధములు.

జాతిస్వేచ్ఛ, దేశ స్వాతంత్ర్యము, శాంతి స్థాపన నిమిత్తమై సత్యాగ్రహ సమరమున దుమికిన శ్రీరాములను బంధించినది దొరతనము. కదనయోధులకు కారాగార క్లేశము మంచినీళ్ల ప్రాయము. జయజయ ధ్వానములతో సాగనంపినది ప్రజానీకము.

శ్రీరాములకు చెఱసాలలోని జీవితము క్రొత్తగాదు. చీకటిగదుల నివాసముల ననుభవించిన వాడే. గంభీరమైన హృదయము, దీక్షానిమగ్నమైన మనస్సు, భక్తి శ్రద్ధలతో మిళితమైన పట్టుదల జీవితము నానందమయముగ నొనరించినవి.

వేలకొలది స్వాతంత్ర్యయోధులతో చెఱసాలలు కిట కిట లాడినవి. విశాలాంధ్ర విజృంభణమునందు విప్లవ తరంగములుపొంగి నింగిని పొడిచినవి. పల్లె పల్లెకొక బాలచంద్రుడు ప్రభవించినాడు. ఇంటింట నొక మాంచాల వెలుగొందినది. నాడు ప్రతిభారతీయుని రక్తము సలసల మని యుడికినది. కోకచుట్టి కత్తిబట్టి శివమెత్తి కదన సీమను చిందులు ద్రొక్కు తెలుగు వీరు డహింసా సిద్ధాంతమునకు కట్టుబడవలసి వచ్చినది. దెబ్బకు దెబ్బతీయు పౌరుషము శాంతిదూత యాదేశము ననువర్తింపవలసి వచ్చినది. పొగలురేపి సెగలు చిమ్మి భుగ భుగలతో పొంగులువారు రౌద్రరసము కరుణా ప్రవంతిలో కలిసిపోవలసి వచ్చినది.

చెఱసాలలోనుంచుట ప్రయోజన రహితమని నిశ్చయించి స్వాతంత్ర్యయోధుల నందరిని వదలిపెట్టినది. ప్రభుత్వము. మాసము, నాల్గుమాసములు, నాల్గువత్సరములని, తోచినరీతిని శిక్షలు విధించుట, హెచ్చుతగ్గుల నేర్పఱచి తరగతులుగా విభజించుట, నాటి పరిపాలకుల కౌటిల్యము. విభజించి పరిపాలించుటయను సూత్రము శ్వేతజాతికి వెన్నతో బెట్టిన విద్య కదా !

కారాగారమునుండి విముక్తినొందిన తోడనే నిర్మాణ రంగమున ప్రవేశించినాడు శ్రీరాముడు. విశాల భారతములో

విస్తృత సేవారంగములో విశ్వమూర్తి గాంధీజీ ధర్మ పథములో విహరించు యోగిపుంగవుడు శ్రీరాముడు.

రాజకోటలో దీన జనసేవలో లీనుడైనాడు. విదేశీయ వస్తు బహిష్కరణము నమలుజరుపవలెనన్న ఖద్దరు ప్రచార మత్యంత మవసరము. ఖద్దరు ధరింపుడని నోటి మాటలతో చెప్పిన ఫలితముండదు. త్రికరణశుద్ధిగా నియమముల పాటింప వలెను. ఆదర్శనీయుడుగా నడచుకోవలెను. ఖద్దరు ధరింపుడని బోధించుటకన్నను ఆ బట్ట నుత్పత్తిచేయు తెలుంగెఱింగింప వలెను. అందువలన శ్రీరాములు రాట్నము స్వయముగా త్రిప్పెడువాడు. "కదురు కవ్వమాడినచో క అ వు ం డ ద ను సామెత" చేసి చూపెడివాడు. ప్రత్తిని విడగొట్టుటనుండియు నేతలు చేయుటవఱకు, నూలుతీయుటనుండియు చిలపలు చుట్టుటవఱకు నెందఱికో నేర్పగలిగినాడు.

మహాత్ముని నిర్మాణరంగమునందు గ్రామ పారిశుధ్యము ప్రధానాంగము. చేత చీపురుబట్టి వీధులూడ్చుట సంఘసేవకుని ప్రధాన లక్షణము. మురికి పేటలందు పర్యటించి మురుగు దొడ్లను శుభ్రపఱచువారు భగవత్స్వరూపులని మహాత్ముడు వాక్రుచ్చినాడు. గాంధీజీ పర్యటనలందు హరిజన వాడలే ఆ మహనీయునివసతి గృహములు గదా! శ్రీరాముడా పథము నందే చరించినాడు. పాకీవాడై వీధులూడ్చినాడు. హరిజనుడై

వారి గుడిసెలలో సంచరించినాడు. ప్రబోధకుడై మద్యపాన నిషేధ ప్రచారము గావించినాడు.

ఒక్క రాజకోటయందు మాత్రమేగాదు. అటనుండి గుజరాతు దేశమునకు తరలి తరవాడా గ్రామమందు నివాస మేర్పఱచుకొనినాడు. అట శ్రమజీవిసంఘమునందు శ్రామికుడై నాడు. అనుదినము శ్రామికుల కష్ట సుఖములందు భాగము పంచుకొన్నాడు. రైతుల నికృష్టజీవితమునందలి లోతు పాతులను కనిపెట్టినాడు. కూలీల కడగండ్ల గమనవాహినుల యురవళ్లను తెలిసికొన్నాడు. పల్లెపట్టుల సౌభాగ్యమే భారతావని శోభనము. గ్రామ సీమల సిరి సంపదలే భారతజనని నిండు దినము. ఈ రహస్యమును మున్ముందు గ్రహించినవాడు మహాత్ముడు. నాటినుండి నేటివఱకు ఈ బహిరంగ సత్యము నంతగా పాటింపని కతముననే దేశాభ్యుదయము కుంటినడక నడచుచున్నది. ఈ నిజము నేనాడో పసిగట్టినాడు శ్రీరాముడు. ఒక్కొక్క వ్యక్తియు నొక్కొక్క గ్రామమున కంకితుడై పోయిన నెంతబాగుండును! ఎట జూచినను సంఘములు మాత్రము లెక్కకు మిక్కుటములుగా పుట్టగొడుగులవలె కనబడుచున్నవి. పదవుల కొఱకు సంఘములు. పలుకు బడుల కొఱకు పదవులైన, సేవారంగ మెక్కడున్నది? మాసమున

కొక కార్యవర్గసభ పడాదికొక వార్షికోత్సవముతో కార్య క్రమము జయప్రదముగా సాగిపోవుచున్నది !

శ్రీరాముల సేవారంగ యిటువంటిదిగాదు. అందతనికి పదవులులేవు. బాధ్యతలు మెండు. విందులులేవు. ఉపవాసము లెక్కువ. అనుకూలములు తక్కువ అవరోధము లెక్కువ.

నాడు నూలువడకుటయనిన ప్రభుత్వమును కూల ద్రోయుటయని భావము. వీథులూడ్చుటయన్న మేధానిధులకే చులకన. కల్లుద్రావుట మానుడని చెప్పిన వారి యెముకలు గుల్లయగుచుండెడివి.

ఈ పరిస్థితులలో నేటి కెదురీదినాడు శ్రీరాములు. సంఘ శాసనముల ధిక్కరించినాడు. ప్రభుత్వ యంత్ర ధాటి కాగి నిలువ గలిగినాడు శ్రీరాములు.

తరవాడనుండి మజిల కొమరవోలు గాంధీజీ ఆశ్రమ మున చేరినాడు. శ్రీరాముని ప్రవేశముతో చివురులెత్తిన దచటి ప్రకృతి. శ్రమజీవులకు స్వాగతమిచ్చుట సౌందర్య ప్రకృతికి స్వభావ సిద్ధముగదా !

ఆశ్రమ జీవితములో ననురాగముల పండించు తరుణ మున మరల వినవచ్చినది పిలుపు

అది నలుబది రెండవ సంవత్సరమునాటి ఆగస్టు ఉద్యమము. బొంబాయిలో జాతీయ నాయకుల నిర్బంధించినది సామ్రాజ్యవాదుల బలగము. ఉద్రిక్తులైన ప్రజలు భారత మాతను బంధించిన పాశములో యన్నట్లు గానంబడుచుండిన తంతి తీగెల త్రెంపివేసినారు. ఆమె హస్తములకు తగిలించిన సంకెళ్లోయన్నట్లు తోచిన రైలుపట్టాలను తొలగించినారు. తెనాలి స్టేషనంతయు అగ్నిదేవుని కాహుతియైనది. ఆంధ్రావనిలో ఖాండవ దహనములు జరిగినవి.

ఈ మహా విప్లవము నెదుర్కొనలేని దొరతనము గుండెలు జార్చుకొని మంచము పట్టినది. మారణాయుధముల నుపయోగించియు, బాంబుల వర్షించియు ప్రజా ప్రవాహము నరికట్టలేకపోయినది. ఎనిమిదేండ్ల బాలిక గుండుకెదురుగా తన గుండెలజూపినది. పదేండ్ల పసిబాలుడు చొక్కావిప్పి ఫిరంగి ముందు నిలబడినాడు. ఒడలు జలదరించు ఘట్టములతో మేను పులకరించు విప్లవమది.

శ్రీరాములహింసావాది శాంతమూర్తి. సాధువు. సత్యవ్రతుడు. సాయుధ విప్లవ వ్యతిరేకి. తన తనువునైనను బలినిచ్చి శత్రువును కాపాడగల కరుణామూర్తి. అయిననేమి? బంధించినది దొరతనము. నాటి దొరతనమునకు కన్నులులేవు కనుటకు. పండ్లుండినవి నమలుటకు దాని కరాళ దంష్ట్రిలలోబడి నమలి

వేయఁబడిన నాయకులెందఱో గదా! లాటీలతో మోది లాలా లజపతి రాయుని బలిచేసికొన్నది నాఁడు ప్రభుత్వమే. మఱల చెఱసాల జేరినాఁడు శ్రీరాములు. దేశ మల్లకల్లోలమైనది. నాయకులందే రెండు చీలికలు పరోక్షముగా గన్పించినవి. కొందఱు చెఱసాలలందు మరికొంద ఱజ్ఞాతవాసమందు ఒక వర్గ మహింసాయుతమగు పోరాటమందు, మరొక వర్గము సాయుధ విప్లవమందు నిలిచిపోయిరి.

ఈ భయంకరమైన వాతావరణ మందయోమయా వస్థలో చిక్కుకొన్నది ప్రజానీకము. మహాత్ముని సహ చరులతో పాటు బంధింపఁబడినాఁడు శ్రీరాముఁడు.

నాయకులు చెఱసాలలందు నవసిపోయిన రోజులవి. ఏ కొద్దిమందియో తప్ప మిగిలిన వారందరు నరకయాతనల ననుభవించినారు.

శ్రీరాముల జీవితము కష్ట పరంపరలకాగి నిలిచినది. కడగండ్ల స్రవంతులకు తట్టుకొనినది. నిర్బంధకాలమునంతయు నిర్భయముగా గడుపగలిగినాఁడు. విప్లవము చల్లారలేదు గాని మహోద్ధృతము కొలదిగా తగ్గజొచ్చినది.

దేశమున జరిగిన కల్లోలముల కంతులేక పోయినది. ఎట్టకేలకు దిగివచ్చినది ప్రభుత్వము. నాయకులందఱు విడుదలైనారు.

చెఱసాలనుండి యీ వలకు వచ్చినవెంటనే శ్రీరాముల నాకర్షించినది నిర్మాణరంగము. నిర్మాణమే యతని కార్యక్రమముగదా ! త్యాగమే యీ మహానుభావు నాదర్శము గదా ! పెన్న తీరమున ప్రారంభించినా డఖండ సూత్ర యజ్ఞమును. రాట్నప్రచారము తన నిత్యజీవితమైపోయినది. సంఘ సంస్కరణాభిలాష మెండైనది. కుల భేద నిర్మూలనమునకు కంకణముగట్టినాడు. విశాల విశ్వమున మతమనునది నాగరికతా చిహ్నమైనప్పటికి నొక్కొక్కతఱి యది మానవత్వమునే మ్రింగివేయుట కాస్పదమిచ్చినది. స్వాతంత్ర్య ప్రదాయిని హిందూమతమున కులములు వృత్తుల నాధారము చేసికొని వికసించినప్పటికి నవి సంకుచిత బీజంబుల వెదజల్లి స్వార్థవృక్షముల బెంచి విషఫలముల నిచ్చినవి. ఈ యథార్థమును గుర్తించిన మహాత్ముడు వివిధ మతముల మహదాశయ సాధనములే మానవత్వ వికాసములని లోకమునకు చాటినాడు. కులభేదముల నిర్మూలనమే నవ్యజగతి నిర్మాణమని విశ్వమునకు బోధించినాడు. గాంధీజి సత్యపథంబున సంచరించు శ్రీరాములా కార్యనిర్వహణకు గడంగినాడు.

భిక్షాటనముతో సేకరించిన వస్తుసామగ్రితో సమిష్టి భోజనముల నేర్పఱచినాడు. వివిధకులముల లారేకపంక్తిని గూర్చుండి భుజించుపద్ధతి సంఘమునకు క్రొత్త. బహిరంగో

పన్యాసములందు శాకాలాడుచు గొంతులు చించుకొను మహా వక్తలు సహితము తమ గృహముల ముంగిళ్లకైనను హరిజనుల ప్రవేశింపనీయరు గదా !

శ్రీరాములా మహారణ్యమునందు మల్లెతీగెలను పెంచ గలిగినాడు. ఆ విరిసిన సుమముల ఘుమ ఘుమలు దేశమంత టను వ్యాపించినవి. సమిష్టి భోజనములందలి ప్రయోజకత్వమును గ్రహించిన యువకులందఱు నందుకు పూనుకొనినారు.

విశ్వేశ్వరుని సృష్టిలో నందఱు సమానులే. హెచ్చు తగ్గులను భేదములు కుటిలమానవ కృత్రిమ కల్పనలు.

ఆ భావముతోడనే హరిజనులకు దేవాలయ ప్రవేశ మిప్పింప సమకట్టినాడు. కర్మవీరుడు కంకణముకట్టుట తడవుగాని సాధింపక విశ్రమించుట కలలోని మాటగదా ! అది ధీరో దాత్తుని సహజ లక్షణము.

మంత్రములతో మామిడికాయలు రాలవుగదా ! కార్య మునకు గడంగిన వెనుక విజయమో వీరస్వర్గమో మహా వీరుల ధ్యేయము. మహాత్ముడు ప్రపంచమునకు ప్రయోగించి చూపిన ప్రాయోపవేశ దీక్ష వేయి పాశుపతాస్త్రముల కంటెను మిన్నయైనది. స్థిరచిత్తముతో నిశ్చల దీక్షతో భగ వత్ప్రేరితమైన సంకల్ప బలముతో ప్రారంభించినాడు నిరశన

వ్రతమును. ఆ మహా యజ్ఞమునందనుదినము వ్రేల్చినాడు తన మేని కండరములను. జార్చినాడు ఉష్ణాశ్రుపులను, హృదయ కుహరమును జీల్చి సమర్పించుకొన్నాడు వేడి వేడి రుధిర ధారలను. ఆ మహాగ్ని జ్వాలలందు కవోష్ణ రక్తము ధారలు గట్టి వర్షించినపుడెల్లను వాయుదేవుడు తోడైనాడు. తపోగ్ని జ్వాలా మాలికల తోరణములు విశ్వమందంతట వ్యాపించినవి. ఒక్కదినముగాదు. ఒక్కవారముగాదు. ఇరువదిమూడు దినములఖండ నిరశన వ్రతము సాగినది.

ఊగిసలాడిపోయినది సనాతనత్వము. గడగడలాడినది ఛాందసత్వము. దేవాలయము తలుపులు తెఱువ బడినవి. హరిజనులమితానందంబుతో దైవదర్శనము చేసికొన్నారు. ఆ మహదానంద విజయ ఘోష నాలించి పులకితుడైనాడు మహాత్మగాంధి.

చిరునవ్వులు తొలకరింపగా తన బోసినోటిని విప్పి రతనాల పలుకులతో నాశీర్వదించినాడు శ్రీరాములను. నిరశన వ్రతమునందలి మహత్తర శక్తిని గుర్తించినది ప్రపంచము.

ఈ మహా విజయోత్సాహముతో పొంగి పోయినది సింహపురము. పరవళ్లువారినది పినాకిని. ప్రజ్వలించినది వాడ వాడల సాంఘిక విప్లవాగ్ని.



•

# ప్రజ్వలన!



విశ్వచరిత్రలో ప్రభవించినదొక వినూతనాధ్యాయము. శ్రామిక పోరాటము నందుదయించిన దొక స్వర్ణఘట్టము. భవ్యమూర్తి బాపూజి దీర్ఘ తపః ఫలితముగా భారతమాత దాస్యము తొలగి పోయినది. గాఢ తిమిరావళిని జీల్చుకొని ప్రభవించినాడు స్వాతంత్ర్య భానుడు. నవనవోన్మేష కాంతి పుంజములతో నవతరించినది నవభారతము.

అఱువదేండ్ల పోరాటఫలము అచంచల దేశభక్తుల బలిదాన ఫలము. అకళంక జాతీయ యోధుల రక్తదాన బలము స్వతంత్ర నవభారత నందనము.

ఝాన్సీరాణి వెదజల్లిన విప్లవాంకురము లేనాటికి ఫలితములిచ్చినవి! మహాత్ముని అహింసావ్రతమెంత త్వరగా విజయమునందినది! జాతీయ వీరయోధుల స్వప్నము లెన్నటికి నిజములైనవి!

భారతమాత వదనమున నవ్వుల మొలకలు నాట్యమాడినవి. నీతి జయించినది. జాతి వికసించినది. ఖ్యాతి పరవళ్లు ద్రొక్కినది. కీర్తి పరిమళించినది. విభూతి పొంగిపోయినది.

1947 ఆగస్టు పదునైదవ తేది భారతదేశ చరిత్రయందు మాత్రమేగాదు విశ్వచరిత్రయందే మధురాతి మధుర ఘట్టము. ఆఘట్టముతో విశ్వమంతటను చలనముకల్గినది. బర్మా, సింహళములవంటి వలసరాజ్యములన్నియు స్వాతంత్ర్యమును సంపాదించుకొన్నవి.

ఒకవైపున నవిరళోత్సాహముతో భారతీయులు మహోత్సవములను సాగించుచున్న తరుణమున మఱొకవంక నుపవాసముతో దైవప్రార్థనమునందు లీనమైనాడు గాంధీజీ. సాధించుటయేగాదుగొప్ప. సాధించిన వెనుక లభించిన స్వాతంత్ర్యమును సద్వినియోగము చేసికొనుటలోనే వివేకము సామర్థ్యము గర్భితములై యున్నవి. భారతీయులకు నిబ్బరమును, కార్యదీక్షను ప్రసాదింపుమని బాపూజీ ప్రార్థించినాడు. స్వతంత్ర భారతమును తీర్చి దిద్దుటకు ప్రయత్నించినాడు. మత భేదములను రూపుమాపుటకు, మత కలహ జ్వాలలను చల్లార్చుటకు సర్వ శక్తులతో పూనుకొన్నాడు. ఈ పూనిక జయప్రదమయ్యెడు సూచనలు కనిపించు శుభ ఘడియలలో నొక మహాప్రళయము సంఘటిల్లినది. ప్రపంచమే స్తంభించి పోయినది. విశాల భారతము విషాదసాగర గర్భమందు సొమ్మసిల్లి శయనించినది.

వెక్కి వెక్కి విలపించినారు కోట్లమంది. ఏడ్వలేక కుమిలి

కుమలి గుండెల భారముతో కూర్చున్నారు లక్షలమంది. విన్న పాటున విగతజీవులైనారు కొందఱు. భారతదేశ స్వాతంత్ర్య ప్రదాత అస్తమించినాడు. మతావేశములో చిందులు త్రొక్కిన అజ్ఞాన పిశాచావిష్టుఁడొకఁడా ఘోర మరణము ప్రాప్తింపఁజేసెను.

మహాత్ముని నిర్యాణము మన శ్రీరాములను క్రుంగ దీసినది. జీవితముపై విరక్తి పుట్టినది. భవిష్యత్తుపై నాశలు నశించినవి. అంధకార బంధురజగత్తునందు దేనినంటె వెలుగును కనిపించక పోయినది.

చెదరిన గుండెలను చేరదీసికొనుటకు కలఁగిన మనస్సును కూడ గట్టుకొనుటకు, కొన్నిదినములు పట్టినవి. మహాత్ముడు కనుమఱుగైనను సిద్ధాంతము నిత్యనూత్నముగ నెదుగుచునేయున్నది. వారు చూపెట్టిన నిర్మాణరంగమెంతయూ విశాలముగ జూపట్టుచునే యున్నది. దీనులు, పేదలు, కూలీలు, రైతులు, హరిజనులు, కార్మికులు, ఏ వైపు చూచినను నిత్యదారిద్ర్యముతో, నిరక్షరాస్యతతో నిస్సహాయులై యలమటించుచున్నారు.

"హరిజన సేవయే హరిసేవ" అన్నాడు మహాత్ముడు. ఈ వాక్యములో నెంతయో పరమార్థమున్నది. గాంధీజి వారికే తన జీవితము సంకితము చేసినాడు. అదే రంగమునందు తాను

గూడ జీవితము సంకితము చేయవలెననియు, అవసరమైనచో జీవితమునే త్యజించ వలయుననియు శ్రీరాములు నిశ్చయించు కొనినాడు.

స్వాతంత్ర్యము సిద్ధించినది గాని పేదలకు ఫలితము లందినవిగావు. హరిజనుల కడగండ్లకు భరత వాక్యము పాడెడు యోగము కలుగలేదు. వారి కడగండ్లు పెరుగుచునే యుండి నవి. ఇడుములు బలవత్తరములగుచుండినవి. జాతి పిత బాపూజీ నిర్యాణముతో చివరియాసలడుగంటినవి. మొదలు నరికిన వృక్షమువలె కూలిపోయినదా సంఘము. చుక్కానిలేని పడవ వలె పవనఘోషలో పడిపోయినది వారి నిర్మాణరంగము.

భారతదేశమంతట నంధకారము స్వైర విహారము చేసినది. హరిజన సేవారంగమొక సహారాయైనది. అటనట మంచినీళ్ల మడుగులైన నుండునేమో యిట నవిగూడ గోచరిం చుట లేదు.

నిరాశాపూరితమైన విశాలాంధ్రమందలి హరిజనుల సేవకై మణికంకణము గట్టినాడు శ్రీరాములు. హేమాద్రి చలన మెరుగునేమో తెలియదు. దీక్షాబద్ధుడైన శ్రీరాముల హృదయ మేకార్యమందు లగ్నమైనప్పటికి నది తిరుగుముఖము పట్టి యెఱుంగదు. రవ్వంతయైనను చలించబోదు.

స్వాతంత్ర్య మెవరినిమిత్తమని ప్రశ్నించినాడు దేశమును. అది దీన జనులకు హరిజనాభ్యుదయమునకు నుద్దేశింప బడినదని గుర్తించుట కవసరమని వక్కాణించినాడు. బలిసిన శ్రీమంతులు తెగ బలియుచున్నారు గాని శుష్కించిన పేదలకు విముక్తి లేదని ఘోషించినాడు.

మహాత్ముల జాతకము లటువంటివి. వారు విశ్వకల్యాణార్థమై ప్రభవించినారు. లోక శ్రేయస్సు నిమిత్తమై శ్రమించినారు. శ్రీరాములా చాలులోని వాడు.

సమర శంఖమును పూరించినాడు. సాంఘిక స్వాతంత్ర్య కదన సీమయందేకాకియై నిలిచినాడు. నాటి సవ్యసాచికి రథ సారథి కృష్ణభగవానుడు. నేటి ఫల్గుణునికి సత్యమే సారథ్యము వహించినది. నాటి యుద్ధరంగము కురుక్షేత్రము. నేటి సమరాంగణము విశాలాంధ్ర ప్రాంగణము. ధర్మమే రథము నీతిన్యాయములే జవనాశ్వములు. అహింసావ్రతమే గాండీవము. అఖిలాంధ్రుల యాశీస్సులే అక్షయ తూణీరములు.

ప్రపంచ చరిత్రలో ప్రభవించినదొక స్వర్ణ ఘట్టము. సాంఘిక నిరంకుశత్వముతో నిరంతర సమరము. ఒక్క శుభ ముహూర్తమున ప్రారంభించినారు నిరశన వ్రతమును.

ఎదుటివారిని హింసింపక తన్ను తాను హింసించుకొని త్యాగ సమాధిలో తనువు చాలించుట ప్రాయోప వేశమందలి పరమార్థము. తొలి విజయానుభవమున్నది. పేదల ప్రేమామృత వర్షములు కురియుచున్నవి. హరిజనుల ప్రార్థనల ఫలితములు కాచుకొనియున్నవి. పరమాత్మ డిచ్చిన ఆత్మబల మజేయముగా నిలిచియున్నది. తపోధనుని త్యాగమహిమ విశ్వమంతటను వ్యాపించినది. కంపించిపోయినది సాంఘిక నిరంకుశ పిశాచి. శ్రీరాముల జీవితమును నిలుపనెంచినది ప్రజానీకము. ఎలుగెత్తి పెనుఘోషలతో శివమెత్తి తిరుగుబాటుకు సిద్ధపడినది. తెలుగు పౌరుషములు వెలుగుల జిమ్ముచు జ్వాలలై జ్వలించినవి. ఆంధ్ర శౌర్యము రుసరుసలాడుచు గగనమును, కబళించుటకు పైకి లేచినది. పాలుగుడుచు పసిబాలుడు సహితనూ నివాదముల విసి స్తనము విడిచి చేతికందిన ఆట వస్తువే మహాయుధమనుకొని మహాగ్రహముతో మండిపడుచు నురకలువేసి గడపదాటుకొని వీధిని ప్రవేశించినాడు.

ప్రజావాహిని పెల్లుబికిన తరుణమున దాని నాపుటకు హిమాచలము లడ్డుపడినను వీలుపడదు. ఆనకట్టల నధిగమించి వంతెనల ముంచివైచి గట్టుల త్రెగనోసి మహావృక్షముల పెకలించి ప్రళయ నృత్యముతో విలయ విలాసలీలతో భూగోళమును ముంచివేయగలదు. సూర్యగోళమును చల్లార్చగలదు.

ఆ నీరవాహిని పవిత్రోదకముల ధ్రువుని పాదకమలముల కభిషేకము కావలసినదే.

భారతదేశమునకు లభ్యమైనదొక్క రాజకీయ స్వాతంత్ర్యము మాత్రమే. ఆ వెనుక సాధించవలసినది సాంఘిక స్వాతంత్ర్యము. ఏతత్సాధనార్థమే మహాయోగి శ్రీరాములు తలపెట్టిన మహాయజ్ఞము. ప్రభుత్వము జాతీయమగుటంజేసి సద్యఃఫలము లభించినది. ఇఱువదితొమ్మిది రోజులు నిరసన వ్రతము నిరాటంకముగా సాగినవెనుక చెన్నపురి ముఖ్యమంత్రి ప్రకటన వెలువడినది. ప్రతి మాసమందును చివరి దివసమును హరిజనోద్ధరణకై వినియోగింపవలసినదిగా జిల్లాయధికారులకుత్తరువులు పంపబడినవి.

శ్రీరాములు ప్రాయోపవేశ మహాస్త్ర ప్రయోగముతో సాధించిన ద్వితీయ విజయమది. సంకల్పము, సాధన, ఆచరణ ప్రజ్వలనములతో వారి కీర్తి కాంతులు దిగంత విశ్రాంతములైనవి. మహోన్నతాదర్శ పరిపూర్ణుడగునా మహాపురుషునికి కృతజ్ఞతాంజలి ఘటించినది హరిజనలోకము. చేతులెత్తి జేజేలు పెట్టినది ప్రజానీకము.

విశాలాంధ్ర సేవారంగమున విజేతయై వెలుగొందినాడు శ్రీరాములు. మహాయజ్ఞమున కరిగించిన రక్త

మాంసముల మరల పొందుట సామాన్యవిషయముగాదు. శుష్కించిన శరీరము విజయోత్సాహముతో కోలుకొన్నది. క్రమ క్రమముగా సహజస్థితికి వచ్చుట కెంతయో కాలము పట్టలేదు.

విస్తృతమైన హరిజనాసేవా పథమునందొక మైలు రాయినినాటి మళ్ళల నిర్మాణరంగము వైపునకే దృష్టిని సారించినాడు.

నిప్పులు చెరగు మండుటెండలలో కుండపోతలై వర్షించు వానలలో శీతవాతాతపంబులకు వెనుకాడక జానపదంబుల పర్యటించి నిర్మాణరీతుల నుపదేశించినాడు శ్రీరాములు. సంచారముచేయు రహదారులు గులకరాలమయములైనను పాదరక్షలు ధరించినదఱుదు. నుదురు చిట్లిపోవు నిదాఘ సమయములందైనను గొడుగుపట్టిన వాడుగాడు. ఇదంతయు విశ్వకల్యాణమునకు శాంతి సౌజన్య సౌభ్రాత్ర సౌశీల్య సౌభాగ్యసాధనములకు నై చేసినాడు.

నెల్లూరుమండల మదృష్టముల కొల్లగొన్న సీమ. లేనిచో నిట్టి మహాత్ముని పాదరజములచే పునీతములైన పల్లెలట నుండునా! ఆ మహానుభావు నమృతవచనముల నాలించు సంపదకు నోచుకొనిన గ్రామసీమల రైతుకూలీల యదృష్టమేమన వచ్చును!

విశ్వమునకు వెన్నముక కర్షకుడు గదా! తెలుగురైతు భవిష్యత్తునందే విశాలాంధ్ర భాగ్యోన్నతు లాధారపడినవన్న రహస్యమును బహిర్గత మొనర్చినాడు.

సమస్త మానవశ్రేయస్సుకై యుద్దేశింపబడిన సర్వోదయ సిద్ధాంత ప్రచారమునందు లీనమైనాడు. మహాత్ముని నైతిక పథమునందు దేశమును కొనిపోదలంచి విధవిరామముల విసర్జించి కార్యరంగమున చుఱుకుదనముతో పనిచేయగడంగి నాడు. కనబడిన యువకులనందఱ చేరదీసి సర్వోదయ మత సారమును నూరిపోసి వారిని నిర్మాణరంగము వైపునకు మరల్ప శతవిధముల ప్రయత్నించినాడు. అశాశ్వతమై, అస్థిరమై అధఃపతితమై పోవుచున్న జీవితము నావాపథముల దిక్కులకు మరలించి, ఆత్మ సౌందర్యమొక్కటియే వ్యక్తిత్వశీలమును పెంచి జీవితము పునీతము చేయగలదని బోధించ గడంగినాడు.

గౌతమబుద్ధునికి లభించిన ఉపగుప్తు డేవిధంబున బౌద్ధ సిద్ధాంత ప్రచారమున తన జీవితమును సార్థకము జేసికొన్నాడో యదేవిధమున గాంధీజీకి శిష్యుడై ఆ మహాత్ముని సిద్ధాంత ప్రచారమునందే తన జీవితమును ప్రయోజనవంతముగా గడుప దీక్షవహించినాడు శ్రీరాముడు.

సర్వోదయ సిద్ధాంత ప్రచార మఖండముగా సాగు చుండినది. బాపూజీ నిర్యాణానంతరమా మహాత్ముని పేర

గొప్ప సిద్ధి ప్రయోగము చేయబడినది. ఆ పవిత్రాదర్శము వారి సిద్ధాంత ప్రచారముకొరకై సంకల్పింపబడినది. ప్రయోగము చేయుట సులభము కావచ్చు. కానీ ఆవిత్తమును సంస్థ శ్రేయస్సునకై వినియోగించుటలో సెవలేని చిక్కులున్నవి. ఆ మహా కార్యసాధనకు వాస్తవిక సత్యవాదులవసరము. నిజమైన ధర్మకర్తలు లభింపవలెను.

శ్రీరాములందుకు తగిన వాడని లోక మెఱుగును. సంచాలకుడుగా నుండుమని పిలుపు వచ్చినది. గురుతరమైన బాధ్యతలు పైబడినపుడు తప్పుకొనుట పాడిగాదు. ఆ బాధ్యతను స్వీకరించినాడు శ్రీరాములు. సేవారంగమున శ్రమించు వారికి భుక్తి గడచుట యొక పెద్ద సమస్య. దీనజన సేవలో బిచ్చమెత్తుకొనుటకే దినమంతయు వెచ్చించిన నిక సేవ చేయుటకు తీరిక యెక్కడిది ? ఈ చిక్కును పాశ్చాత్యులు గ్రహించినంతగా మనవారు గ్రహించలేదు. అట సంఘాధ్యక్షులకు గౌరవ వేతనములున్నవి. రాజకీయరంగమైనను వైజ్ఞానిక రంగమైనను జీతములేని పదవులఱుదు. సారస్వత వైజ్ఞానికోపన్యాసము లిచ్చువారికి చాలినంత ప్రతిఫలముల నందజేయుటచట చిరకాలమునుండి వచ్చెడి యాచారము. మనదేశమందు వక్తల నుపన్యాసముల నిచ్చుటకు రమ్మని పిలుచుఘనమైన యాచారమున్నది గాని వారికి దారిఖర్చులైన బంపుకొను స్తోమత, విజ్ఞత యలవడలేదు.

శ్రీరాములకా కార్యక్రమము నిమిత్తమై నూట యేబది రూప్యములు గౌరవవేతనము, నిర్ణయించినారు. వ్యయము సేయగలవారి కా జీతమేపాటిది. అది దారి వెచ్చముల క్రిందనే వ్యయము కాగలదు. కాని శ్రీరాములు కష్టజీవి. పొదుపరి తనము వారి కాదినుండియు నలవాటైనది. మహాత్ముని శిష్యాగ్ర గణ్యుడు. కనుక మాసమునకు ముప్పది రూప్యములనుండి ఏ బ ది రూప్యములవఱకు మా త్ర మే గై కొన్నాడు. శేషించిన పై కమా నిధియందే జమకట్టినాడు.

ఇంతటి యుదారత యెవరియందుండును? త్యాగధనుల లక్షణమది. మహాత్ముల స్వరూప సందర్శనము నిటువంటి సామాన్యవిషయ దర్పణములనుండియే ప్రతిబింబింప ప్రారంభించును గదా!

అంతము నెఱుగని యాశను త్యజించిన మహాత్యాగి యతడు. కనుకనే విశాలవిశ్వమున నెవరికినందని ధ్రువస్థానము నార్జింప గలిగినాడు. విశ్వచరిత్రలో మహోన్నత స్థానము నందు కొన్నాడు.



# ఆత్మార్పణ!

అవి ప్రథమ ప్రపంచ మహాసంగ్రామము ప్రారంభముగా నున్నదినములు. విశ్వసీమ వీర వాహినులచే ప్రక్షాళితము కానున్న ప్రజ్వలిత కాలము. 1913 లో బాపట్లయందు ప్రారంభమైన దాంధ్రోద్యమము. దేశభక్తుడు నడుముగట్టి కార్యరంగమున ప్రవేశించిన శుభలగ్నమది. రుద్రమాంబ రౌద్ర రసావేశము జ్ఞప్తికి వచ్చినది. పలనాటి తెలుగుబిడ్డల వేడిగుండియలలో పౌరుషాగ్ని ప్రజ్వలించినది. ఆహ్వానించినా డాంధ్రయోధులను కొండా వెంకటప్పయ్య. ఆ మహనీయుని పిలుపునందుకొన్న నా డే పయనమైనారా మహాసభకు తెలుగుజోదులు. సమావేశము జయప్రదమైనది.

నాలుగేండ్ల వఱకు ప్రపంచ మహాసంగ్రామముయొక్క తాకిడితో నాంధ్రోద్యమ కొంత కుంటి నడక సాగించినప్పటికి నా వెనుకటి రెండేళ్లు గగనమును చుంబింప విజృంభించినది.

భారత స్వాతంత్ర్య సమరమున సహాయ నిరాకరణోద్యమమందు చెన్నపురిలో ఫిరంగిగుండ్లకు గుండెల నెదురొడ్డి గర్జించిన దాంధ్ర కేసరి. ప్రతి ఉద్యమమందును తెలుగువారి

పరాక్రమ స్ఫూరితములగు పోరాటముల దిలకించి పులకితు డైనాడు మహాత్ముడు. స్వరాజ్యసాధనా నంతరము దేశము భాషాప్రయుక్త రాష్ట్రములతో నభ్యుదయము సాధించ వలసి యున్నదని వ్రాసినాడు. ఆంధ్రుల శౌర్య సాహస ముల కబ్బురపడినాడు వల్లభభాయి.

మహోగ్రమై. మహోజ్వలమై అనుదిన మజేయ సంపదలతో వెలుగొందుచువచ్చిన స్వాతంత్ర్య మహోద్యమ మందు దృష్టిని కేంద్రీకరించినా రాంధ్రవీరులు. ఆంధ్రమహాసభ లప్పు డప్పుడు నుద్యమము చల్లారలేదని నిరూపించు చుండినవి.

స్వాతంత్ర్య భానూదయముతో విశాలాంధ్రమవత రించగలదను నాసలు రేకెత్తినవి. స్వాతంత్యము సిద్ధించినది గనుక విశాలాంధ్ర సాధనమే, మన లక్ష్యమని విజయోత్సవము లందే ప్రకటించినా రాంధ్రనాయకులు ఆంధ్ర కేసరి, ఆచార్య రంగా, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారివంటి మహా నాయకులు రాష్ట్రసాధనకు ప్రయత్నములు ప్రారంభించినారు.

తత్ఫలితముగా ప్రధానామాత్యులు జవహర్లాల్ నెహ్రూ, నాటి కాంగ్రెస్ అధ్యక్షులు పట్టాభి సీతారామయ్య, హోంమంత్రి సర్దార్ పటేల్ గారితో నొక ఉపసంఘ మేర్పడినది. వారు తయారుచేసినదే జె. వి. పి. రిపోర్టు. దేశ

మందలి భాషా రాష్ట్రనిర్మాణముల కుద్దేశింపబడినది ఈ నివేదిక ప్రభవించుటకు ప్రధాన హేతు వాంధ్రరాష్ట్రోద్యమని వేఱుగా నిర్వచించుట యనవసరము.

ఈ నివేదిక ఆంధ్రులలో నిరాశను రేకెత్తించినది. నిస్పృహను ప్రేరేపించినది. తెలుగురాజుచే దానమివ్వబడి, తెలుగు శ్రామికులచే నిర్మింపబడి, తెలుగు సంపదచే పోషింపబడి, తెలుగు జనులచే నింపబడి సహజ సౌందర్యముతో, సమృద్ధియగు వ్యాపారగరిమలతో జలదముల చుంబించు సౌధరాజములచే విశాలమై వెలుగొందిన తెలుగు పట్టణము చెన్ననగరము. తెలుగువారిది కాదను వాదము ప్రచ్ఛన్నముగా నా నివేదికయందు ప్రస్ఫుటించుటయే యిందులకు కారణము. మదరాసుపై నాంధ్రులు హక్కు వదలుకొనవలెనను చిన్నిగీత పెనుతుఫానునే రేకెత్తించినది. అది తెలుగు వారినే యవమానించుచున్నదని యెత్తిపాడినారు నాయకులు.

నాయకత్రయ నివేదిక ఆంధ్రులకు నష్టదాయకమైనదని తేలిపోయినది. ప్రయత్నములు మాత్రము సాగుచునే యున్నవి. ఆందోళనమున కంతులేదు. ప్రచారమునకు పరిమితి లేదు. మూలనున్న ముసలమ్మ సహితము విశాలాంధ్ర

మేర్పడి తీరవలెనను ప్రబలమైన వాంఛితమును విశ్వమున కంతకు వినిపించినది. విప్లవము నందుకొనిన విద్యార్థులు మహోద్యమము నుచ్చస్థాయికి గొనిపోయినారు. ఈ ప్రధాన సమస్యను ప్రజాసమస్యగా చిత్రించి ప్రచారమునకు బూను కొన్నవి పత్రికలు. రాజకీయ నాయకులకిది నిత్య సమస్యగా వ్యక్తమైనది.

ఇంతలో విభజన సంఘమొకటి యేర్పడినది. ఆంధ్ర రాష్ట్రమునకు పరిశిష్ట చెన్న రాష్ట్రమునకు ఆస్తి హక్కుల పంపకమునకై యది యుద్దేశించబడినది. నాటి రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ కుమారస్వామిరాజా, భక్తవత్సలం, గోపాలరెడ్డి, ప్రకాశం పంతులు, కళా వెంకటరావు మొదలగువారందులో సభ్యులు.

దీర్ఘచర్చలు జరిగిన వెనుక మద్రాసుపై నాంధ్రులు హక్కు వదలు కొనుటకు, కోటి రూపాయలు ముదరా యిచ్చు టకు నొప్పుకోబడినది. స్వర్గమును మఱపించు మదరాసు నగరమెక్కడ! కోటిరూప్యముల పరిహార మెక్కడ! ఈ బహిరంగమైన పచ్చి యన్యాయమున కొప్పుకొనలేదు ప్రకాశం గారు. ఆ తరుణమందే మదరాసుకు వచ్చియున్న ప్రధాని నెహ్రు గారికి తన యసమ్మతిని తెలిపి ఆంధ్రు లిందు కొప్పుకొనరని ప్రకటించినాడు ప్రకాశం పంతులు.

విభజనసంఘము ప్రయత్నము లింతటితో నాగిపోయి నవి. ప్రకాశము పంతులుగారి పట్టునెగ్గినది కాని రాష్ట్రము మజిల వెనుకకు పోయినదని నిరుత్సాహ పడి నా రాంధ్రులు.

విశాలాంధ్రమున నాయకలకు కొఱతలేదు. మహా మేధావులున్నారు. ప్రపంచ వైజ్ఞానికసమితి కధ్యక్షుడు, భారత రాజ్యాంగమున కుపాధ్యక్షుడు రాధాకృష్ణపండితు డాంధ్రుడు. డాక్టర్ పట్టాభిసీతారామయ్య, ఆచార్యరంగా, ఆంధ్ర కేసరి, ప్రకాశం పంతులుగారి వంటి మహా నాయకులున్నారు. తెలుగు తల్లి దురదృష్టము వలన నేకోన్ముఖమైన ప్రయత్నము లెక్కువగా సాగినవిగావు. "ఎవరికి వారే యమునా తీరే" చందమున చరిత్ర చప్పగా సాగుచు వచ్చినది.

విశ్వమునకు ప్రతి సృష్టి గావించిన వి శ్వా మి త్రు ని వారసు లాంధ్రులు. అవసరమైనపుడు గరళ కంఠులు కాగలరు. కదన రంగమున సవ్యసాచికి సరితూగ గలరు. ప్రతిజ్ఞలు పట్టిన పరశురాముని మించిపోగలరు.

ఆంధ్రుల మనోవాంఛితములు జవనాశ్వములై యుర కలు వేయుచు పరుగులు తీసినవి.

భాషా రాష్ట్ర నిర్మాణములే కాంగ్రెస్ మహదాశయ మని యెలుగెత్తి చాటిన జాతీయ నాయకు లెందు కూర

కున్నారను ప్రశ్న పెద్దదైనది.

జరుగుచున్న చరిత్రనంతయు బరిశీలించుచున్న శ్రీరాములకీ యుద్యమము పట్ల నెక్కువ శ్రద్ధ గల్గినది. నిర్మాణాంగములో భాషారాష్ట్ర వ్యవస్థీకరణమొక ప్రధానాంశము. పరిపాలనము మాతృభాషయందు జరిగినపుడే న్యాయము రక్షింపబడగలదని మహాత్ముడు నుడివియున్నాడు. తన జీవితము గాంధీజీ పరమాశయ సాధన నిమిత్తమే యంకితమివ్వబడియున్నది. జీవితము క్షణ భంగురము. ఒక్క ప్రాణత్యాగముతో మూడుకోట్ల ప్రజలకు విముక్తి గల్గినచో నంతకంటెను కావలసినదేమి యున్నది ?

పూనిన దీక్షలందపజయములులేవు. సాధన పూర్తి యగునంతవఱకు విరమణలేదు. ఫలప్రాప్తినందువఱకు విశ్రాంతి యుండదు.

అఖండ భారతఖండమునకు స్వాతంత్ర్యమును ప్రసాదింపజేసి విశ్వఖ్యాతి గడించినాడు గురువు. అఖిలాంధ్రమునకు విముక్తి ప్రసాదించి స్వరాష్ట్రమును నిర్మించి ఖ్యాతి నందుటకు శిష్యుడు పూనుకొనుటలో నబ్బురమేమున్నది.

నిరశన వ్రతమనగా పండ్లరసముల గ్రోలుటగాదు. బాదామి పప్పుల మ్రింగుటగాదు. కండచక్కెరల చప్పరించుట

గాదు. జీవితముపై నాశను త్యజించి శాశ్వత సమాధియందు సజీవుడై కూర్చుండుట. పోరాటము నాగరికులతోనై నచో జీవితము దక్కవచ్చును. అటుకానియెడల ప్రాణాహుతి నొంద వలసినదే. మేనికండరములందలి ప్రత్యణువు నొక్కొక్కటిగా యజ్ఞజ్వాలలందు వ్రేల్చవలసినదే. పలుచబడుచువచ్చిన రక్త నాళములందలి చివరినెత్తురు బొట్టుతోసహా మహాగ్ని కీలల కాహుతి కావలసినదే.

మదరాసునగరమందలి మైలాపూరున మహర్షి సాంబ మూర్తిగారి నివాస స్థానమున నుపవిష్టుడైనాడు శ్రీరాములు. 1952 అక్టోబరు 17 వ తారీఖున ప్రారంభమైనది బ్రహ్మాండ యజ్ఞము.

వల్మీకి నిమగ్న దేహముతో మైమఱచిన వాల్మీకి మహర్షి వలె తపస్సులో కూర్చున్నాడు శ్రీరాములు. నాటి వాల్మీకి తన జీవిత పరమార్థము నిమిత్తమై తప మాచరించినాడు. నేటి శ్రీరాములు తన రాష్ట్ర విముక్తికై తనువు శుష్కింప జేయుచు తపస్సు చేసినాడు. నాటి విశ్వామిత్రుని తపస్సును భంగము చేయగలిగినాడు మహేంద్రుడు. నేడు శ్రీరాముల తపోదీక్షను భగ్నముచేయ వెనుకాడినది ప్రపంచము.

రోజులు గడచుచున్న కొలంది ప్రజలయందావేశము పెచ్చు పెరుగుచుండెను. తపోగ్ని కీలలు విస్తృతములై

ప్రపంచమంతట నాక్రమించుచుండెను. ఆంధ్రుల రక్తనాళములు ప్రజ్వలించుచుండెను. రాష్ట్రాందోళనము విశ్వరూపమును ధరించుచుండెను.

ఎవరినోట విన్నను శ్రీరాముల నామమే వినబడుచుండెను. తెలుగుతల్లి సంకీర్తనములే ధ్వనించుచుండెను. శ్రీరాముల ఉపవాస దీక్ష మహాయజ్ఞ నిర్వహణ విధానముల గురించిన శీర్షికలతో పత్రికలన్నియు నిండిపోయెను.

ఎవరీ భగీరథుడని విశ్వమంతయు శ్రీరాములవైపునకు దృష్టిని కేంద్రీకరించినది. నగరమందలి యువలోకము దినమును శ్రీరాములను సందర్శించి జోహార్లు సమర్పించుకొనుచుండెను. తన్నుగాంచు కుతూహలముతో నేతెంచినవారి నందరిని చిరునవ్వుతో నాహ్వానించుచు ఒకటి రెండు వాక్యములతో దివ్య సందేశములందిచ్చి వీడ్కోలు చెప్పుచుండెడి శ్రీరాముల దీక్షావ్రతమఖండముగా సాగుచు వచ్చినది.

లెఫ్టినెంటు కర్నల్ టి. యస్. శాస్త్రి, డాక్టర్ కస్తూరి నారాయణమూర్తి, డాక్టర్ అవధానిగార్లు ఆ మహామహుని శరీరస్థితిని పరీక్షించుచుండిన వైద్య ప్రముఖులు.

శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యము, మద్దులేటి, మోతే నారాయణరావుగార్లు మహానుభావునకు పరిచర్య చేయుటకు

నోచుకొనిన ప్రజాసేవకులు.

దేశమున కలకలము బయలుదేరినది. నాడు శ్రీరాముడు సముద్రతీరమున చేసినది మూడురోజు లుపవాసవ్రతము. నేడు శ్రీరాములు ప్రారంభించినది దీర్ఘ కాల ప్రాయోపవేశము.

ఘంటముల కదలించిన దాంధ్ర కవిలోకము. లక్షల బాలచంద్రు లక్షయమైనటుల, కోట్ల ప్రతాపరుద్రులు ప్రభవించినటుల విశాలాంధ్రమొక విశాల కురుక్షేత్రమై పరాక్రమముల విరియబూసినది. ఘోర గంభీరమై ఘోషించు మహోదధి తరంగములై విఱుచుకొని పడినది విద్యార్థి లోకము.

శ్రీరాముల విలువైన ప్రాణముల రక్షింపవలెను. విశాలాంధ్ర మవతరించవలెనను నినాదములు భూ నభోంత రాళములు బ్రద్దలుచేసినవి. తెలుగునాట ప్రతి పట్టనమందు నాంధ్రుల బావుటా విజయ పవన వీచికలందు ఱెప ఱెప లాడినది.

పిడికిలిని బిగించి నాడాంధ్రుడు. కోదమసింగమై కదన సీమకుఱికి పదునుకత్తుల పైకిదీయుటకు సిద్ధపడినాడు. ప్రచండ భానుడై ప్రజ్వలించి జగత్తును భస్మీపటలముఁజేయుటకు తలపడిన తెలుగు బాలభానునిగాంచి ధూమశకటములు

పట్టాలుతప్పి ప్రక్కకొరిగినవి. త్రైల శకటములు ముందుకు వెళ్ల లేక వెనుకాడినవి.

హింసాపూరిత విధానము లాత్మహత్యా సదృశము లనియు, వానిని విడనాడి శాంతిపథంబున చరించుటయే తెలుగు వీరుల లక్ష్యమనియు తన ప్రజలకు సందేశ మొసగినాడు త్యాగ శ్రోత్తముడు.

కాని, ఆవేశాపూరితమైన ప్రజానీకమున కా సందేశము సరిగా వినబడలేదు. శివమెత్తి ప్రళయ నృత్యముతో విలయ కృత్యముల కుపక్రమించు వీరభద్రుల కా దివ్యసందేశము విని పించు నవకాశములు తక్కువైనవి.

నేటికి నిరశనవ్రతముపూని నలుబదిరోజులైనదని విన్న తెలుగువాని గుండెలు పగిలిపోక నిలుచునా ? నాటి మానవుల శ్రేయస్సునకు రక్తమాంసముల హోమ కుండము నందను దినము వ్రేల్చుచున్న అపర శిబి చక్రవర్తిని, గాంచిన జనంబుల హృదయంబులు పొంగులువారక యూరకుండునా !

కాటికేగినను పోటీ తప్పని పరిస్థితులలో భీరబిగిసి కొని కూర్చొనిన రాజకీయనాయకులందఱు నేకమై ప్రాయోప వేశ దీక్షను విరమింప వలసినదిగా ప్రార్థేయ పడినారు. పట్టు దలతో రాష్ట్రమును సాధించు దనుక నొక్క త్రాటిపై నడచె

దమని బాసలు చేసినారు. విశాలాంధ్ర సాధనమే లక్ష్యముగా విభేదములను విడనాడి స్వాతంత్ర్య దీక్షను పూనుకొనగలమని శపథములు చేసినారు.

ఈ బాసలతో ఈ ప్రతిజ్ఞలతో శ్రీరాములు చలింప లేదు. ఆ మహనీయుని చరమ లక్ష్య మాంధ్ర నాయకుల నడుమ నైక్య సాధన మాత్రమేగాదు. అది రాష్ట్ర సిద్ధికై గురి పెట్ట బడినది. ఆంధ్రావతరణ కేంద్ర ప్రభుత్వాధిపతుల హస్తములందున్నది. ఈ నాడు రేపు మరునాడనే కాలహరణ మున కా మహాత్ముని మహాయాగమాగదు. అద్ది ఫలితము నాశించినది గానీ ఫలితము కలుగ గలదనే దృఢవిశ్వాసము నాశించినదిగాదు.

1952 డిశంబరు పదునైదవ దినము, మహర్షి, మహా త్ముడు, మహాత్యాగి, మహోన్నత త్యాగమూర్తి, మహో జ్వల తపోధనుడు, మహనీయశక్తి సంపన్నుడు, మహేశ్వరునిలో విలీనమైనాడు.

నిశాసమయము. పదునొకండు గంటలు ఇరువది మూడు నిమిషములు. పట్టణము మేలుకొనియే యున్నది. కాని శోక సాగర తరంగములలో కొట్టుకొని పోయినది. విద్యు ద్దీపములు వెలుగుచునేయున్నవి. అయినను గాఢాంధకారము

తన నల్లటి చెఱగుతో ప్రకృతిని కప్పివేసినది. నింగిలో చుక్కల సమూహామునుండి యొక మహోజ్వల తార దిర్ఘ ప్రయాణము చేసినటుల కనిపించినది. ఆ నక్షత్రము విశ్వ వీధి నుండి విను వీధి కెగసినదేమో!

సూర్యుడుదయించినాడు గాని విషాదచ్ఛాయల ముసుగు విడివడలేదు. విశాలాంధ్రము విషాదసాగరములో మునిగిపోయినది. కనులు తెఱచిన కనకదుర్గ నిప్పులను కురిపించినది. విజయవాడలో లేచిన సెగలు భుగభుగల మంటలతో పట్టణమును చుట్టివైచినది.

ఎటుకనినను రప రపలే. ఎటుగాంచినను తెలుగు సేనల రుస రుసలే. ఏవైపుచూచినను క్రోధారుణ నేత్రంబులనుండి స్రవించెడు రుధిర ధారాప్రవాహా గమన వేగముల ప్రళయ హోరులే.

మహాత్ముడు శ్రీరాముల భౌతికదేహ మూరేగినది. అది మహా ప్రస్థానము. కవికథామారుల సారస్వత విషాద సాగర వీచికలలో నుయ్యాల లూగుచు, తెలుగు నుడికారంపు సొంపు నింపుల గాన లహరుల వింజామరల మలయ పవనతరంగములలో పయనించినాడు మ హా త్ము డు. ఇసుక వేసిన రాలని జన సందోహము. రాజ బాట దట్టమై ప్రజలతో నిండిపోయినది.

ప్రతి వాని ముఖసీమయందును ప్రజ్వలించుచున్నవి పౌరుషజ్వాలలు. తొంగిచూచుచున్నవి శౌర్య కిరణచ్ఛాయలు.

ఆనందము, ఆశ్చర్యము, పౌరుషము, భయము, భక్తి రోషము, క్రోధము, మానవసైజ గుణంబులన్నియు నొక్క-సారి ముద్దకట్టి ముందడుగు వేయించుచున్నవి.

మహాత్ముని భౌతిక దేహమును దర్శించు కుతూహలముతో వేలాదిప్రజలు ప్రోగైనారు. భగవన్నామ సంకీర్తన మొక వంక, పౌరుషజ్వాలలను ప్రదీప్తించు మహాంధ్ర సమరగానము లొక ప్రక్క-, ఉడుకునెత్తుటితో నుప్పొంగుచు విశ్వమునే కబళింప నుంకించు విద్యార్థి వీర కిశోరముల విజయ నినాదము లొక వంక, గాఢాంధకారబంధురమై భయావహమై, కన్పట్టు భవిష్యత్తు నూహించుకొని లోలోన దేవుని ధ్యానించుచు రథము ననుసరించి నడిచెడు వృద్ధులొక వంక, ఎవరీ పుణ్యపురుషుడు? ఎవరీ మహోజ్వలత్యాగశాలి? ఎవరీ స్వాతంత్ర్య భాస్కరుడు? అభినవ గాంధీమహాత్ముడు! కడసారి దర్శనము దొరికినదిగదా యను నాసతో సౌధోపరి భాగములనుండి పూలవానలు కురిపించు మగువలొక దెస!

ఎన్నిమైళ్లు పొడవున్నదో ఈ ప్రజాప్రవాహము! ఎందఱున్నారో లెక్కించిన దెవరు?

వైద్యశాల సమీపమును చేరుకొనునంతలో వచ్చి వ్రాలినాడు రెక్కలు కట్టుకొని ఆంధ్రకేసరి. కేసరి గుండెలు నీరైనవి. పౌరుషము ప్రజ్వలించినది. ఆదృశ్యమునుగాంచిన ప్రజా సందోహ మెలుగెత్తి పొలి కేకలు పెట్టినది. ఆ పెను కేకలలో ప్రతిధ్వనించినది మహాపట్టణము. బెదరినాడు సముద్రుడు.

వేదోక్తముగా నంత్య సంస్కారములు ముగిసినవి. ఆ మహనీయుని కెందఱు చుట్టములు! అఖిలాంధ్రమునకే ఆత్మ బంధువు గదా!

అగ్నిహోత్రుని పవిత్ర జ్వాలలు భగ్గుమనినవి. అచట నున్న మా గుండెలు చివుక్కుమనినవి. ఆంధ్రకేసరి యౌదార్యంపు పలుకులతో కొలది యూఱట గల్గిన దాంధ్రులకు.

విశాలాంధ్ర సీమలో రగులుకొనిన విప్లవాగ్ని ప్రపంచ మంతటను వ్యాపించినది. నేడో రేపో ఆంధ్రలక్ష్మి యవతరించ నున్నదని మన ప్రధాని ప్రకటించినాడు!



# ప్రభాతము.

---

తెలుగుతల్లి నోముల పంట మహాత్ముడు శ్రీరాముల నిర్యాణముతో ప్రధాని నెహ్రూ పండితుడు కేంద్రశాసన సభలో రాష్ట్రమును స్థాపించగలమని ప్రకటించినారు. ఆంధ్రుల విజ్ఞాన భాస్కరుడు రాధాకృష్ణ పండితుడు గూడ పై సభలో నిటువంటి ప్రకటననే కావించినారు.

ఫలితముగ రాజస్థానమునుండి హైకోర్టు ప్రధాన న్యాయ మూర్తులు శ్రీ కైలాసనాథ వాంఛూగారు పరిస్థితుల సమీక్షించి యుక్తమైన తీర్పు నిచ్చుట కరుదెంచినారు. న్యాయ మూర్తి అన్ని జిల్లాలను పర్యటించి, 1953 ఫిబ్రవరి ఏడవ తారీఖున నొక సమగ్రమైన నివేదికను సమర్పించిరి.

రాజధానిని తాత్కాలికముగా మదరాసునందుంచ వలెననియు, మద్రాసు రాష్ట్ర మాంధ్రరాష్ట్రమునకు రెండు వందల ముప్పదిలక్షల రూప్యములు పరిహారముగా నీయ వలె ననియు తెలుపుచు ముఖ్యపట్టణముల కనువైన స్థలములను గూడ కొన్నిటిని సూచించినారు.

రాష్ట్రమునకు కేంద్రమైన ముఖ్యపట్టణము నెన్నుకొను

స్వేచ్ఛ ఆంధ్రులకే విడుచుట శ్రేయస్కరమని ప్రధానమంత్రి నెహ్రూ నిర్ణయించి రాష్ట్రోదయమునకు గావలసిన సమస్త సన్నాహములను ప్రారంభించినారు.

ఆంధ్రులలో నుత్సాహ మతిశయించినది. శ్రీ బాగ్ ఒడంబడిక ననుసరించి విశాలాంధ్ర మహోజ్వల భవిష్యత్తును దృష్టిలో నుంచుకొని శాసనసభ్యులు ప్రవర్తించ దగునని ప్రజలు తమ తమ మనోభీష్టములను వివిధ విధములుగా నెఱింగించినారు.

1953 జూన్ నెలలో నాంధ్రశాసన సభ్యులు సమావేశమైనారు. తర్జన భర్జనల తదనంతరము కర్నూలు నగరమును రాష్ట్రకేంద్రముగా నిర్ణయించినారు.

దురదృష్టమున బంగారము వంటి నగరము బళ్లారి పోయినది. దౌర్భాగ్య వశమున తెలుగురాజుల దానముతో తెలుగువారి శ్రమతో తెలుగు వారి మేడలతో, తెలుగునేత శ్రీరాముల జన్మస్థానమైన మదరాసు నగరము కూడ నాంధ్రుల కందకపోయినది.

. .

విశ్వమంతయు సర్వేశ్వరుని కుటుంబము. పరిపాలనా సౌలభ్యము, సారస్వత సంస్కృతీ విజ్ఞాన వికాసముల

నిమిత్తమై భాషాప్రయుక్త రాష్ట్రములు కాని సామ్రాజ్య విస్తరణ వాంఛలతో కాదుగదా ! తమిళ తెలుగు విభేదములు తాత్కాలికములు. కనుకనే మదరాసును విడిపోయినను తెలుగుతల్లి సంతసముతో నాశీర్వదించు చున్నది.

మహనీయుడు శ్రీరాముల పూర్ణాహుతి ఫలితముగా మహాదాంధ్ర ముదయించినది. 1953 అక్టోబరు మొదటి తేది విశ్వచరిత్రలో స్వాతంత్ర్య సంపుటములో త్యాగశీలుర మహా ధ్యాయములో సువర్ణాక్షరములతో లిఖింపబడినది.

ప్రధానమంత్రి పండితుడే స్వయముగా ప్రారంభించి నాడు. ఆంధ్రకేసరి ముఖ్యమంత్రి, శ్రీ సంజీవిరెడ్డి, శ్రీ పి. తిమ్మారెడ్డి, శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ సంజీ వయ్య, శ్రీ పట్టాభిరామరావు, శ్రీ కోటిరెడ్డి ప్రభృతు లమాత్యులుగా నాంధ్రరాష్ట్రమునకు పాలకులగు మహద్భాగ్య మునకు నోచుకొనివారు.

మన గవర్నరు శ్రీ చందూలాల్ త్రివేది. తెలుగు తల్లి చల్లని పాలవెల్లియై పరిపాలనలో నమృతము లొలికించి తెలుగు మాగాణమును సస్యశ్యామలము జేసి, తెలుగు సార స్వత నందవనమును పుష్పింపజేసి, తెలుగు విజ్ఞాన పుంజముల

వెలయింపజేసి, తెలుగు కీర్తికాంతుల దిగంత ప్రశాంతములుగ జేయగలదని, మహాత్ముడు శ్రీరాముల తపస్సు ఫలింపగలదను విశ్వాసముతో సర్వేశ్వరుని ధ్యానించెదము !

జై ఆంధ్ర!

